బాలానంద బొమ్మల

# ఆలివర్ ట్విస్ట్



మూలం :

## చార్లెస్ డికెన్స్

స్వేచ్ఛానుసరణ :

## సింగంపల్లి అప్పారావు





**నవరత్న బుక్ హౌస్**

కారల్ మార్క్స్ రోడ్, విజయవాడ-520002.

**బాలానంద బొమ్మల ఆలివర్ ట్విస్ట్**


రచన :

**సింగంపల్లి అప్పారావు**



ప్రథమ ముద్రణ :

**నవంబర్ 2000**





ముఖచిత్రం :

**రవి**

లోపలి బొమ్మలు :

**వి.యస్. ప్రకాష్**







**బి. కె. ఆర్. మూర్తి (పబ్లిషర్)**

28-22-20, రహిమాన్ వీధి

అరండల్ పేట, విజయవాడ-2

ఫోన్ : 432 813

ముద్రణ :

**డి. బి. ప్రింటర్స్**

విజయవాడ-2

**వెల : రు. 25-00**

## విద్యార్థినీ విద్యార్థులకు అమూల్య నేస్తాలు

ఇంగ్లీష్-తెలుగు డిక్షనరి
తెలుగు-ఇంగ్లీష్ డిక్షనరి
హిందీ-తెలుగు డిక్షనరి
తెలుగు నిఘంటువు
త్రిభాషా డిక్షనరి
తెలుగు-హిందీ డిక్షనరి
ఇంగ్లీష్-ఇంగ్లీష్ డిక్షనరి
ఇంగ్లీష్-హిందీ డిక్షనరి
హిందీ-ఇంగ్లీష్ డిక్షనరి
రసాయన శాస్త్ర నిఘంటువు
జంతుశాస్త్ర నిఘంటువు
వృక్షశాస్త్ర నిఘంటువు
గణితశాస్త్ర నిఘంటువు
భౌతికశాస్త్ర నిఘంటువు
ఇంగ్లీష్ వ్యాసాలు-లేఖలు
హిందీ వ్యాసాలు-లేఖలు
తెలుగు వ్యాసాలు-లేఖలు
ఇంగ్లీష్ గ్రామర్
హిందీ గ్రామర్ (హైస్కూల్)
హిందీ గ్రామర్ (డిగ్రీ)
లాఫ్లీ జోక్స్
త్రిభాషా వ్యాకరణం
ఎంకిపాటలు
హితవాహిని

తెలుగు వ్యాకరణము
సులభ వ్యాకరణము
45 రోజుల్లో ఇంగ్లీష్
45 రోజుల్లో హిందీ
ఇంగ్లీష్ తెలుగు స్వబోధిని
హిందీ తెలుగు స్వబోధిని
గణిత ఒలింపియాడ్ (తెలుగు)
గణిత ఒలింపియాడ్ (ఇంగ్లీష్)
గణిత సూత్రములు
గణితము-సమస్యలు-సాధనలు
ప్రాథమిక గణిత శాస్త్ర స్వబోధిని
అంక గణితం
గణితశాస్త్రం (బీజగణితం)
స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్
ఫోటోగ్రఫీ నేర్చుకుందాం
తెలుగు సామెతలు
ఇంగ్లీష్ తెలుగు సామెతలు
మీ ఆంగ్ల పదజాలం పెంపొందించుకోండి
జోక్స్ వరల్డ్
1001 జోక్స్-జోక్స్-జోక్స్
1001 వింతలు-విచిత్రాలు
నవ్వులు
ఖగోళశాస్త్రం-క్విజ్
కార్టూన్లు

## బాలసాహిత్యంలో - బంగారు మొలకలు

బాలానంద బొమ్మల షిరిడీ సాయిబాబా
" అరేబియన్ నైట్స్ అద్భుత కథలు (3 భాగాలు)
" షేక్స్‌పియర్ అద్భుత కథలు(3భాగాలు)
" బైబిల్ కథలు (2 భాగాలు)
" సింద్‌బాద్ సాహస యాత్రలు
" రాబిన్‌సన్ క్రూసో సాహస యాత్రలు
" డాన్ క్విక్సోట్ సాహస యాత్రలు
" రాబిన్‌హుడ్ సాహస యాత్రలు
" రెండు మహానగరాల కథ
" డేవిడ్ కాపర్ ఫీల్డ్
" ఆలివర్ ట్విస్ట్
" రాజు - పేద
" ప్రపంచ అద్భుత కథలు
" పంచ తంత్రం (2 భాగాలు)
" రామాయణం
" భారతం
" భాగవతం
" దశావతారాలు
" శ్రీకృష్ణలీలలు
" టిప్పుసుల్తాన్
" వీరపాంట్య కట్టబ్రహ్మన

బొమ్మల మర్యాద రామన్న కథలు
" అల్లావుద్దీన్ అద్భుత దీపం
" అలీబాబా 40 దొంగలు
" అక్బర్ బీర్‌బల్ వినోద కథలు
" భేతాళ కథలు
" తెనాలి రామకృష్ణ కథలు
" పరమానందయ్య కథలు
" భట్టి-విక్రమాదిత్యుల కథలు(2భాగాలు)
" అపూర్వ చింతామణి
" కాశీ రామేశ్వర మజిలీల కథలు
" గలివర్ సాహస యాత్రలు
" భగత్‌సింగ్
" బి. ఆర్. అంబేద్కర్
" సుభాష్‌చంద్రబోస్
" ఆజాద్ చంద్రశేఖర్
" రాజా రామమోహనరాయ్
" మదర్ థెరిసా
" రవీంద్రనాధ్ టాగూర్
" జయప్రకాష్ నారాయణ్
" యోగి వేమన
" పూజ్య బాపూజీ
" భగవతీచరణ్

# ఆలివర్ ట్విస్ట్

ఆ యువతి నిండు చూలాలు!.... బహుదవ్వు నుండి కాలినడకన అక్కడికి చేరుకుంది. ఆమె వస్త్రాలు మాసి ఉన్నాయి. కాలిబూట్లకు కన్నాలుపడి ఉన్నాయి. తైల సంస్కారంలేని జుట్టు ఆమె దైన్యస్థితిని తెలియజేస్తున్నది.

ఆమెకు నొప్పులు ప్రారంభమయ్యాయి. దారి ప్రక్కగా నేలకు ఒరిగిపోయి బాధపడసాగింది.

అక్కడికి సమీపంగా చర్చి ఒకటున్నది. చర్చి తాలూకు అనాథ శరణాలయ మొకటున్నది. దయార్ద్రహృదయులు ఆమెను అక్కడకు చేర్చారు.

కొంతసేపటికి ఆమె ఓ మగ శిశువును ప్రసవించి హాయిగా యీ లోకాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయింది.

"ఈమె ఎవరు? వివరాలు ఏమైనా తెలిసాయా?" డాక్టర్ నర్స్‌ని అడిగాడు.

"తెలియదు డాక్టర్! ఈమె ఈ ప్రాంతానికి చెందిన వ్యక్తిలా కనిపించడం లేదు" జవాబు చెప్పింది నర్స్.

డాక్టర్ ఆ పిల్లవాడిని లండన్‌లోని ఓ చర్చికి సంబంధించిన అనాథ శరణాలయానికి అప్పగించాడు.

"ఈ పిల్లవాడి తల్లి వివాహిత స్త్రీ కాదు. ఎందుకంటే ఆమె చేతికి వివాహపు ఉంగరంలేదు. తప్పనిసరిగా ఈ పిల్లవాడు ఆమెకు అక్రమ సంతసమనే భావించాలి." అన్నాడు డాక్టర్ అనాథ శరణాలయం అధికారులతో.

శరణాలయం అధికారులు ఆ పిల్లవాడికి 'ఆలివర్ ట్విస్ట్' అని నామకరణం చేసారు.

ఒక సంవత్సరం వచ్చేవరకు ఆలివర్ అక్కడే ఉన్నాడు. సంవత్సరం దాటిన తర్వాత ఆలివర్‌ని మరొక అనాథ శరణాలయానికి తీసుకు వెళ్ళారు.

అక్కడ ఆలివర్ కాక మరొక ఇరవై అయిదు మంది అనాథ శిశువులు ఉన్నారు. ఎనిమిది సంవత్సరాల వయసు వచ్చేవరకు ఆలివర్ అక్కడే ఉన్నాడు.

ఆ అనాథ శరణాలయాన్ని 'మిసెస్ మేమ్' అనే యువతి నడుపుతున్నది. ఆవిడచాలా స్వార్థపరురాలు. మతాధికారులు అనాథ శిశువుల పోషణకోసం ఆమెకు ఎంతో ధనం పంపుతుండేవారు. ఆ ధనాన్ని ఆమె దుర్వినియోగం చేసేది. పిల్లలను సరిగా చూసేదికాదు. ఎవరైనా అధికారులు అనాథ శరణాలయాన్ని తనిఖీ చేయ

డానికి వచ్చేరోజున మాత్రం పిల్లలకు స్నానాలు చేయించి, మంచిబట్టలు కట్టబెట్టేది. శుభ్రమైన భోజనం తినిపించేది.

ఆలివర్‌కి తొమ్మిదవ సంవత్సరం దాటిపోతున్నదనగా మతాధికారి ఒకడు అనాధశరణాలయాన్ని తనిఖీ చేయడానికి వచ్చాడు. అతడిపేరు 'బంచెల్'!....



మిస్టర్ బంచెల్ అనాధ శరణాలయ నిర్వాహకురాలైన మిసెస్ మేమ్‌తో సంభాషించుట

అతడు ఆలివర్‌ని పరీక్షగా చూసాడు. బక్కగా వయసుకు తగినట్టుగాలేని ఆకారాన్ని చూసి బంచెల్ ఎంతో ఆశ్చర్యపోయాడు.

"ఆలివర్‌ట్విస్ట్‌కి ఇప్పుడు తొమ్మిది సంవత్సరాలా?" అని బంచెల్ మిసెస్ మేమ్‌ని అడిగాడు.

"అవును!" అన్నదామె.

"ఈ కుర్రవాడి తండ్రి ఎవరో తెలియజేసినవారికి మంచి బహుమానం ఇస్తామని మఠాధికారులు ప్రకటించారు. ఈ కుర్రవాడు ఎవరికి సంబంధించిన వాడో ఏమైనా ఆరా తీసావా?" మిస్టర్ బంబెల్ అడిగాడు.

"ప్రయత్నిస్తున్నాను! అది సరే! ఎప్పుడూ అడగనిది ఈ రోజు ఆలివర్ గురించి అంత శ్రద్ధగా అడుగుతున్నారేమిటి మిస్టర్ బంబెల్?" అడిగింది మిసెస్ మేమ్.

"ఎందుచేతనంటే.... ఈ అనాథ శరణాలయంలో ఉండే వయసు ఆలివర్‌కి దాటిపోయింది. కనుక అతణ్ని నా వెంట తీసుకుపోయేందుకు వచ్చాను." అన్నాడు బంబెల్.

మిస్టర్ బంబెల్, ఆలివర్‌ని వెంటబెట్టుకుని మరొక అనాథ శరణాలయానికి తీసుకు వెళ్ళాడు. అక్కడ పదిమంది సభ్యులు గల కమిటీ ముందు ఆలివర్‌ని హాజరు పరిచాడు.

"నీ పేరేమిటి?" కమిటీ సభ్యుడొకడు ప్రశ్నించాడు.

"నా పేరు ఆలివర్ ట్విస్ట్, సర్!" అన్నాడు కుర్రవాడు.

"నువ్వొక అనాథ బాలుడివని నీకు తెలుసుననుకుంటాను" అన్నాడు మరొక సభ్యుడు.

"అంటే ఏమిటి సర్?" అన్నాడు ఆలివర్ అర్థంగాక.

"అంటే నీకు తల్లీ, తండ్రీ ఎవరూ లేరన్నమాట! పుట్టిన దగ్గరనుండీ ఇప్పటి వరకూ మఠాధికారుల దయా ధర్మంమీద అనాథ శరణాలయాలలో పెరిగావన్నమాట!"

ఆలివర్ బిగ్గరగా ఏడవడం ప్రారంభించాడు!.... ఆ తర్వాత అక్కడున్న శరణాలయానికి పంపించబడ్డాడు. ఆ రాత్రి ఏడుస్తూనే నిద్రపోయాడు.

తెల్లవారిన తర్వాత ఆలివర్‌కి తినేందుకు ఏదో పెట్టారు. ఆలివర్‌కి ఆ పెట్టినదేదో సరిపోలేదు. సరికదా, నోట పెట్టడానికి గూడ అసహ్యంగా ఉంది. రాత్రి భోజనం కూడా తృప్తిగా ఉండేది కాదు.

ఆ విధంగా మూడు నెలలు గడిచిపోయిన తర్వాత ఆలివర్‌లో కొంత ధైర్యం వచ్చింది. ఒకనాటి రాత్రి అతడు పళ్ళెం పుచ్చుకుని వంటగదిలోకి వెళ్ళాడు.

పిల్లలకు రాత్రి భోజనాలు అమర్చే మిస్టర్ విమ్‌కిన్స్ ఆలివర్‌ని చూస్తూనే

"ఏమిటిలా వచ్చావ్?" అని అడిగాడు.

"నాకు భోజనం చాలలేదు సార్! మరికొంచెం పెట్టండి" అన్నాడు ఆలివర్.

మిస్టర్ విమ్‌కిన్స్ ఆశ్చర్యపోతూ ఆలివర్ ముఖంవేపు తీక్షణంగా చూసాడు. అతడిని ఇంతవరకు ఏ కుర్రవాడు మరికొంత పెట్టమని అడగలేదు.



తనకు భోజనం చాలడంలేదని, ఆలివర్ వంటవాడితో చెప్పుట—

"ఏమిటి అంటున్నావు?" అన్నాడు విమ్‌కిన్స్ వెటకారంగా.

"నాకు మరికొంత ఆహారం కావాలి!" అన్నాడు ఆలివర్ నిబ్బరంగా.

"మిస్టర్ బంబెల్!" బిగ్గరగా కేకపెట్టాడు విమ్‌కిన్స్.

బంబెల్ అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చాడు. విషయమేమిటో తెలుసుకున్నాడు.

"ఆలివర్ పద్ధతి మంచిదికాదు. దీనివల్ల మిగతా పిల్లలు చెడిపోయే అవకాశ ముంది! వీడిని తీసుకువెళ్ళి చీకటి గదిలో బంధించు. ఒక్కరోజు నీళ్లూ, ఆహారం యివ్వకు! అలా చేస్తే ఎక్కువ ఆహారం అడిగే చెడు లక్షణం దానంతటదే పోతుంది" అన్నాడు బంబెల్.



ఆలివర్‌ని చిమ్నీలు తుడిచే వ్యక్తికి యిచ్చివేయడానికి, అనుమతి కోసం జడ్జిముందు ఆలివర్‌ని నిలబెట్టుట!

ఆ మర్నాడు అనాథ శరణాలయం వెలుపల ఒక బోర్డుమీద ఓ ప్రకటన యిలా రాయబడింది:

"ఆలివర్ ట్విస్ట్ అనబడే మా అనాథ శరణాలయం తాలూకు కుర్రవాడిని

తీసుకువెళ్ళి అతడికి ఏదైనా వ్యాపారం నేర్పించిన వారికి అయిదు పౌండ్ల ధనము యివ్వబడుతుంది!"

## 2

ఆ ప్రకటన అటుగా వెళ్తున్న ఓ వ్యక్తి దృష్టిలో పడింది. అతడి పేరు 'మిస్టర్ గమ్‌ఫీల్డ్'! అతడి ఉద్యోగం వీధిదీపాల చిమ్నీలు తుడవడం!—

"నేను ఆలివర్‌కి చిమ్నీలు తుడవడం నేర్పిస్తాను" అన్నాడు గమ్‌ఫీల్డ్, మిస్టర్ విమ్‌కిన్స్‌తో.

మిస్టర్ విమ్‌కిన్స్ ఆలివర్‌ని పేపర్లతోసహా జడ్జిముందు హాజరుపరిచాడు. ఆలివర్ని, మిస్టర్ గమ్‌ఫీల్డ్‌కి యిచ్చేస్తున్నట్టు రాయబడిన కాగితాల మీద సంతకం పెట్టమని అర్థించాడు జడ్జిని!

జడ్జి ఆలివర్ వంక పరీక్షగా చూసాడు!

"కుర్రవాడు లాంతరు చిమ్నీకన్నా చాలా పల్చగా, సున్నితంగా ఉన్నాడు. ఈ కుర్రవాడు అటువంటి కష్టమైన పని చేయలేడు" అన్నాడు జడ్జి.

ఆలివర్ వెక్కి వెక్కి ఏడవసాగేడు.

"ఏం జరిగింది? ఎందుకేడుస్తున్నావు?" ఆలివర్‌ని అడిగాడు జడ్జి.

ఆలివర్ మోకాళ్ళమీద వంగి "నేను అల్పప్రాణిని! నన్ను తగిన వాళ్ళతోనే పంపించమని అర్థిస్తున్నాను" అన్నాడు.

జడ్జికి ఆలివర్‌మీద జాలివేసింది. తన చేతిలోని కాగితాలను చింపిపారేసి "కుర్రవాడిని తిరిగి శరణాలయానికి తీసుకువెళ్ళి సరియైన పోషణలో పెంచండి" అన్నాడు విమ్‌కిన్స్‌తో.

ఆ తర్వాత కొన్నాళ్ళకు 'సావర్ బర్రీ' అనే వ్యక్తి వచ్చాడు.

"నేను చనిపోయిన మనుషుల శవాలను పూడ్చిపెడుతూ ఉంటాను. అది నా వ్యాపారం. దానిని ఆలివర్‌కు నేర్పిస్తాను" అన్నాడు సావర్ బర్రీ.

అయిదు పౌండ్ల ధనంతోబాటు ఆలివర్‌ని, సావర్‌బర్రీ చేతబెట్టాడు మిస్టర్ బంబెల్.

సావర్ బర్రీ భార్య తలుపుతీసి భర్తనీ, ఆలివర్‌నీ లోనికి ఆహ్వానించింది.

ఆమె ఆలివర్‌ని చూస్తూనే పెదవి విరిచి "చాలా చిన్న కుర్రవాడు. శరీరంలో ఎముకలే తప్ప మాంసం ఉన్నట్టు కన్పించడంలేదు" అన్నది.

తర్వాత ఆమె ఆలివర్‌ని వంటగదిలోకి తీసుకువెళ్ళింది. కుక్కకు

వేద్దామని ఉంచిన చల్లని మాంసాన్ని, ఓ రొట్టెముక్కను ఆలివర్‌కి యిచ్చింది.

అది తిన్న తర్వాత "నావెంట రా! నీకు పడకగదిని చూపిస్తాను" అంటూ మిసెస్ సావర్ బర్రీ ఆలివర్‌ని తీసుకుని నేలమాళిగలోవున్న ఓ గదిలోకి వెళ్ళింది.

అక్కడ శవపేటికలు చిందరవందరగా పడి వున్నాయి. చెక్కముక్కలు గదినిండా పడివున్నాయి. గది యావత్తూ చీకటిగా వుంది.

"ఇదే నీ పడకగది!" అంది మిసెస్ సావర్‌బర్రీ.

ఆలివర్ చిన్న చాప పరుచుకుని దానిమీద నిద్రపోయాడు.

ఉదయంకాగానే ఎవరోవచ్చి శవపేటికల గదిని బలంగా తన్నారు. ఆలివర్ ఉలిక్కిపడి లేచి వచ్చి తలుపు తెరిచాడు.

ఎదురుగా నిలబడివున్న వ్యక్తిని చూస్తూనే "మీకు శవపేటిక కావాలా సార్?" అని అడిగాడు ఆలివర్ నిద్రకళ్ళతో.

"నోర్మూయ్!" అంటూ ఆ యువకుడు గదిలోకి అడుగుపెట్టాడు. "నాపేరు నోక్లేపోల్!....నేనెవరో తెలుసా? ఇక్కడ శవపేటికలు తయారుచేసే వ్యక్తిని నేనే! నువ్వు నా పర్యవేక్షణలో పనినేర్చుకుంటావన్నమాట" అన్నాడు నవ్వుతూ.

ఒకసారి ఓ ఇంటిలో ముసలిది ఒకతె మరణించింది. మిస్టర్ సావర్‌బర్రీ, ఆలివర్‌ని వెంటపెట్టుకుని ఆ ఇంటికి శవపేటికను తీసుకువెళ్ళాడు. ముసలిదానిని అందులోపెట్టి చర్చి ఆవరణలో వున్న శ్మశానంలో పూడ్చిపెట్టాడు.

"ఈ ఉద్యోగం నీకు నచ్చిందా?" అని ఆలివర్‌ని అడిగాడు సావర్‌బర్రీ.

"ఇదేం ఉద్యోగం? శవాలను పూడ్చిపెట్టడం....నాకు నచ్చలేదు" అన్నాడు ఆలివర్.

అలా అన్నందుకు మిసెస్ సావర్‌బర్రీ ఆలివర్‌ని యిష్టం వచ్చినట్టు కొట్టింది. ఆరోజు తిండి పెట్టలేదు.

ఒకనాడు నోక్లేపోల్ ఆలివర్ తల్లిని గూర్చి చెడుగా మాట్లాడడం ప్రారంభించాడు. అది సహించలేని ఆలివర్ ఉగ్రరూపం ధరించి అతడిని కర్రతో కొట్టడం ప్రారంభించాడు.

బాగా దెబ్బలుతిన్న నోక్లేపోల్ "ఆలివర్ నన్ను చంపేస్తున్నాడు. రక్షించండి! రక్షించండి!" అని కేకలు పెట్టసాగేడు.

అంతలో మిస్టర్ సావర్ బర్రీ వచ్చి ఆ యువకుడ్ని రక్షించాడు. అలా చేసినందుకు ఆలివర్‌ని ఓ గదిలో పెట్టి తాళం వేసాడు. ఆలివర్ గదిలో కూర్చుని తన

దురదృష్టానికి ఎంతో కుమిలిపోయాడు. ఇక ఆ ఇంటిలో ఉండటం ఆలివర్‌కి యిష్టం లేకపోయింది.

అర్ధరాత్రి కావస్తున్నదనగా నెమ్మదిగా లేచి గది వెలుపలికి వచ్చాడు. ఎవరూ చూడకుండా వీధిలోకివచ్చి ముందుకు దారితీసాడు. శాశ్వతంగా ఆ ఇంటి నుంచి విముక్తిని పొందాడు.



తనకంటె పెద్దవాడైన నోక్లెపోల్ అనే కుర్రవాడిని శవపేటికల గదిలో గుద్దుతూ తన్నుతున్న ఆలివర్!

3

ఆలివర్ లండన్ నగరానికి బయలుదేరాడు. అతడివద్ద తినడానికిగాని తాగడానికిగాని ఏమీలేవు. ఆహారం కొనడానికి చిల్లిగవ్వలేదు. అతడు సావర్ బర్రీ

ఇంటినుండి డెబ్భైమైళ్ళు కాలినడకన ప్రయాణం చేస్తూ లండన్ నగర సమీపానికి చేరుకున్నాడు. మార్గమధ్యంలో అతడు ఎన్నో బాధలుపడ్డాడు. కష్టాలు అనుభవించాడు. ఆకలివేసినప్పుడు ముష్టిఎత్తుకుని కడుపునింపుకున్నాడు. అతడి బట్టలు మట్టి కొట్టుకుపోయాయి. శరీరమంతా చెమటతో తడిసి అసహ్యంగా తయారైంది.



శవపేటికలు తయారు చేసేవారి ఇంటినుండి పారిపోయి వచ్చిన ఆలివర్‌కి దారిలో కనిపించిన కుర్రవాడు హోటల్‌లో భోజనం పెట్టించుట!

ఆ విధంగా ఆరు రోజులు ఏకధాటిగా నడకసాగించిన తర్వాత ఏడవ రోజున మార్గమధ్యంలో ఆలివర్‌కి అతడి ఈడువాడే అయిన ఓ బాలుడు తారసపడ్డాడు.

ఆ కుర్రవాడు యువకుడికి సరిపోయే విలువైన వస్త్రాలు ధరించాడు. మనిషి పొట్టిగా ఉన్నాడు. అసహ్యంగా వున్న చిన్నకళ్ళు అతడు ధరించిన పెద్దకోటు అతడి మోకాళ్ళుదాటి వుంది.

"హేయ్, కుర్రోడా! ఎందాకా ప్రయాణం?" ఆ కుర్రవాడు ఆలివర్‌ని అడిగాడు.

"సమాధానం చెప్పే స్థితిలో లేను. బాగా అలిసిపోయాను. ఆకలిగా కూడా వుంది." అన్నాడు ఆలివర్.

"నాతో రా! నీకు మంచి భోజనం పెట్టిస్తాను." అన్నాడు ఆ కుర్రవాడు.

ఆ కుర్రవాడి పేరు జాక్ డాకిన్స్!...వాడు ఆలివర్ కోసం జామ్ రొట్టె, కొన్నాడు. మాంసం కొన్నాడు. బ్రాందీషాపుకి తీసుకువెళ్ళి రుచికరమైన ద్రాక్ష సారాయం ఇప్పించాడు.

ఆలివర్ ఆ రోజు కడుపునిండా తిన్నాడు. తృప్తిగా తాగాడు. అతడి జీవితంలో అంతమంచి భోజనాన్ని రుచిచూడలేదు. జాక్ డాకిన్స్‌కి ఆలివర్ కృతజ్ఞతలు తెలియజేసాడు.

జాక్ డాకిన్స్‌ని అతని స్నేహితులు 'డాడ్జర్' అని సంభోదిస్తూ ఉంటారు.

"ఆకలిబాధ చల్లారిందికదా! ఇప్పుడు లండన్ నగరానికి వెళ్దామనుకుంటున్నావా?" అని డాడ్జర్ అడిగాడు.

"అవును"

"అక్కడ ఉండటానికి ఏర్పాట్లు అవీ ఏమైనా చేసుకున్నావా?" అన్నాడు డాడ్జర్.

"అటువంటిదేమీలేదు నాకు తెలిసిన వారెవ్వరూలేరు" అన్నాడు ఆలివర్.

"నీ దగ్గర డబ్బు ఏమైనా ఉందా?"

"చిల్లిగవ్వలేదు" జవాబు చెప్పాడు ఆలివర్.

"అలాగా! అయితే ఒక పని చేద్దాం!....నేను కూడా లండన్ నగరానికే వస్తున్నాను. అక్కడ నాకు తెలిసిన ఓ పెద్దమనిషి వున్నాడు. నిన్ను అతనికి పరిచయం చేస్తాను. దానితో నీ కష్టాలన్నీ గట్టెక్కుతాయి. అతడు నీకు మంచి గది యిస్తాడు. నిన్ను తన తమ్ముడిలాగ చూసుకుంటాడు." అన్నాడు డాడ్జర్.

ఇద్దరు కుర్రవాళ్ళు లండన్ నగరం ప్రవేశించారు. నగరానికి ఒక మూలగా ఉన్న చిన్న సందులోకి వెళ్ళారు. అక్కడ శిధిలావస్థలో ఉన్న ఓ ఇంటిలోనికి

ఆలివర్‌ని తీసుకువెళ్ళాడు డాడ్జర్.

"ఓయ్, ఫాగిన్! ఇంటిలోనే ఉన్నావా? నీ కోసం ఓ కొత్త స్నేహితుడ్ని తీసుకొచ్చాను. ఇలా వచ్చిచూడు" అంటూ కేకపెట్టాడు డాడ్జర్.

ఇంటిలో నుండి ఓ వ్యక్తి యివతలికి వచ్చాడు. అతడు పొడవాటి గౌను ధరించాడు. మనిషి చూసేందుకు చాలా అసహ్యంగా కనిపిస్తున్నాడు.



డాడ్జర్, ఆలివర్‌ని తీసుకొచ్చి దొంగల ముఠాలో చేర్పించుట.

ఆలివర్ ఆ ఇంటి వాతావరణాన్ని పరీక్షగా చూసాడు. గదిలో ఒకచోట బల్లముందు నలుగురైదుగురు కుర్రవాళ్ళు కూర్చుని మట్టితో తయారు చేసిన పైపులతో పొగ తాగుతున్నారు. తర్వాత లోటాలతో మత్తు పానీయాలను సేవిస్తున్నారు.

ఫాగిన్ ఆలివర్ వంక అదోలా చూసాడు. తర్వాత నేలలో అమర్చిన రహస్య ప్రదేశం నుండి ఒక పెట్టెను యివతలికి లాగి దాని మూత తెరిచాడు.

అందులో బంగారపు గడియారాలూ, బంగారపు గొలుసులు, ఉంగరాలూ, విలువైన ఆభరణాలు అనేకం ఉన్నాయి.

"ఇవన్నీ నాకు సంబంధించిన వస్తువులు. ఇవన్నీ నాకు నా వృద్ధాప్యంలో పనికొస్తాయని భద్రంగా దాచుకొన్నాను." అన్నాడు ఫాగిన్.

అంత విలువైన సంపద, ఉండి కూడా అతడు ఎందుకూ పనికిరాని ఇంట్లో దేనికి ఉంటున్నాడో ఆలివర్‌కి అర్థంకాలేదు.

ఫాగిన్, డాడ్జరు, ఆలివర్, ఛార్లీబేట్స్ నలుగురూ కూర్చుని భోజనం చేసారు.

"ప్రొద్దుటే వెళ్ళి మీతోబాటు ఏం తెచ్చారు?" అని ఫాగిన్ మిగతా కుర్ర వాళ్ళను అడిగాడు.

"నాలుగు సిల్కు చేతిరుమాళ్ళు తెచ్చాము." అన్నారు కుర్రవాళ్ళు.

"ఓహ్!.... చాలా చక్కని పనితనం చూపించారు. మిమ్మల్ని మెచ్చు కుంటున్నాను. చూడు ఆలివర్! ఇటువంటి పనితనం నువ్వు చూపించగలవా?" అని ఫాగిన్ అడిగాడు.

"తప్పకుండా! అయితే మీరు ఆ పనితనాన్ని నాకు నేర్పించవలసి ఉంటుంది." అన్నాడు ఆలివర్.

వెంటనే ఫాగిన్ పెద్దమనిషి తరహాగా మంచి వస్త్రాలు ధరించాడు. చేతికి బంగారు ఉంగరాలు వాచీ పెట్టుకొన్నాడు. కొన్ని విలువైన వస్తువులను కోటు జేబులో వేసుకున్నాడు. నెత్తిన టోపీ పెట్టుకున్నాడు. చేతిలో కర్ర పుచ్చుకుని గదిలోనే అటుయిటు తిరగసాగేడు. తర్వాత గదిలోవున్న కిటికీగుండా బయటికి చూస్తూ "ఇక మీ పనితనం చూపించండి!" అన్నాడు కుర్రవాళ్ళతో.

కుర్రవాళ్ళు ఫాగిన్ వెనుకగా వచ్చారు! డాడ్జర్ నెమ్మదిగా ఫాగిన్ కోటు జేబులో ఉన్న విలువైన వస్తువులను అతిలాఘవంగా దొంగిలించి ప్రక్కనే ఉన్న ఛార్లీబేట్స్‌కి అందజేసాడు. ఫాగిన్ వెనుదిరిగి చూసేంతలో ఎక్కడి వారక్కడ మాయమైపోయారు.

"డాడ్జర్ బేట్స్ చాలా గొప్పవ్యక్తులు!" అన్నాడు ఫాగిన్ ఆలివర్‌తో.

"నిజంగానే గొప్ప వ్యక్తులు!" అన్నాడు ఆలివర్.

"నువ్వు ఇకముందు వాళ్ళ సలహాలు తీసుకుంటూ ఉండాలి! వాళ్ళు ఏం చేసారో చూసావు కదా! ఇప్పుడు నువ్వు నాకు తెలియకుండా నా కోటుజేబులో ఉన్న సిల్కు చేతిరుమాలును దొంగిలించాలి." అన్నాడు ఫాగిన్ ఆలివర్‌తో.



తనకు నేర్పించిన దొంగతనం విద్యను ఫాగిన్ జేబులోని
చేతిరుమాలును ఆలివర్ తస్కరించి చూపించుట

ఆలివర్, ఫాగిన్ జేబులో నుండి చేతి రుమాలును దొంగిలించడంలో కృత కృత్యుడయ్యాడు. ఆ విధంగానే దొంగతనంలో ఎన్నో మెలకువలను నేర్చుకోగలిగాడు ఆలివర్.

ఆ తర్వాత అతడు మిగతా కుర్రవాళ్ళతో కలిసి, దొంగతనాలు చేయడానికి బయటికి వెళ్ళిపోయాడు.

## 4

ఒక రోజున డాడ్జర్, బేట్స్ కలిసి ఆలివర్‌ని, జనసంచారం ఎక్కువగా వున్న ఒక వీధిలోకి తీసుకొచ్చారు.

"అదుగో! అక్కడ ఒక వృద్ధుడు పుస్తకాలు చూస్తున్నాడు. మేము పుస్తకాల షాపు వద్దకు వెళ్తున్నాము. మేము ఏం చేస్తామో జాగ్రత్తగా గమనించు" అన్నాడు డాడ్జర్ ఆలివర్‌తో.

తర్వాత డాడ్జర్, బేట్స్ కలిసి పుస్తకాల షాపు వద్దకు వెళ్ళారు. అతి లాఘవంగా వృద్ధుడి జేబులో వున్న చేతిరుమాలును తస్కరించారు. మరుక్షణం కుడి వేపుగా పరుగుతీసి, మాయమైపోయారు.

అదంతా చూస్తున్న ఆలివర్ భయంతో కొయ్యబారిపోయాడు. ఫాగిన్, అతడి కుర్రవాళ్ళ పనితనమేమిటో, ఆలివర్‌కి అప్పుడు అర్థమైంది. తను వచ్చి దొంగల మధ్య చిక్కుకున్నానని తెలుసుకున్నాడు. దానితో అతడికి వణుకు ప్రారంభమైంది. ఆలివర్‌కి అక్కడ నిలువబుద్ధి కాలేదు. అటు యిటు చూసి పరుగు లంఘించుకున్నాడు.

చేతి రుమాలు పోగొట్టుకున్న వృద్ధుడు పారిపోబోతున్న ఆలివర్ని చూడనే చూసాడు.

"దొంగ వెధవా! ఆగు అక్కడ! నా జేబు కొట్టేసి పారిపోతున్నావా?" బిగ్గరగా అరిచాడు వృద్ధుడు.

వీధిలో ఉన్న జనం వృద్ధుడి కేకలు విన్నారు. వాళ్ళంతా కలిసి, పారిపోతున్న ఆలివర్ని పట్టుకున్నారు. తర్వాత పోలీసులకు అప్పగించారు.

పోలీసులు ఆలివర్ని తీసుకొచ్చి, కోర్టులో జడ్జిముందు హాజరు పరిచారు. ఆలివర్ భయంతో వణికిపోతున్నాడు.

చేతి రుమాలు పోగొట్టుకున్న వృద్ధుడు కూడా కోర్టుకు వచ్చాడు. అతడి పేరు 'బ్రౌన్‌లో'.

"కుర్రవాడు చాలా బలహీనంగా వున్నాడు. జ్వరం కూడా వచ్చివుంటుందని భావిస్తున్నాను యువర్ ఆనర్!" అన్నాడు బ్రౌన్‌లో జడ్జితో.

అదే సమయంలో పుస్తకాల షాపు యజమాని కోర్టు గదిలోకి వచ్చి, "యీ కుర్రవాడు దొంగకాడు!.... దొంగతనం చేసినవాళ్ళు పారిపోయారు" అని చెప్పాడు.

ఆలివర్ని నిర్దోషిగా వదిలిపెట్టారు. మిస్టర్ బ్రౌన్‌లో ఆలివర్ని తన ఇంటికి

తీసుకొచ్చాడు.

బ్రౌన్‌లో ఇల్లు చాలా అందంగా వుంది. అధునాతనంగా వుంది.

'ఫాగిన్ ఇంటికన్నా ఇది చాలా బాగుంది!' అనుకున్నాడు ఆలివర్. ఆ ఇంటిలోని వారు ఆలివర్ని బాగా చూసారు. కొద్ది రోజులకే ఆలివర్‌కి స్వస్థత చేకూరింది.



ఆలివర్ దొంగతనం చేయకపోయినా, దొంగగా పట్టుబడి కోర్టుకు వచ్చుట.

బ్రౌన్‌లో ఒక రోజున ఆలివర్ని తన గదిలోకి పిలిచి "చూడు ఆలివర్!.... నువ్వంటే నాకెంతో ప్రేమ. నిన్ను అభివృద్ధిలోకి తీసుకువద్దామని కోరికగా వుంది" అన్నాడు.

ఆలివర్ సంతోషంగా "అయితే నన్ను ఎక్కడికీ పంపించరు కదా సార్!"

అన్నాడు.

"ఎక్కడికీ పంపను! నా వద్దనే ఉందువుగాని!....అయితే నీ తల్లి దండ్రు లెవరో ఎక్కడ పుట్టావో అవన్నీ తెలుసుకోవాలని వుంది...." అన్నాడు బ్రౌన్‌లో.

అదే సమయంలో బ్రౌన్‌లో స్నేహితుడు గదిలో అడుగుపెడుతూ "ఎవరీ కుర్రవాడు?" అని ప్రశ్నించాడు. ఆ స్నేహితుడి పేరు గ్రిమ్‌విగ్.



ఆలివర్ పోలీసులకు దొరికాడన్న భయంతో ఫాగిన్
కుర్రవాళ్ళమీద కేకలు వేయుట

"నాకూ పూర్తి వివరాలు తెలియవు. తెలుసుకుంటాను. సంతృప్తి కరంగా ఉంటే నా వద్దనే ఉంచుకుంటాను." అన్నాడు బ్రౌన్‌లో.

గ్రిమ్‌విగ్ నవ్వి "కొత్త వాళ్ళను నమ్మడానికి వీల్లేదు." అన్నాడు.

"ఆలివర్‌కి ఓ పని అప్పగిస్తాను. మార్కెట్‌లో వున్న పుస్తకాల షాపుకి వెళ్ళి కొన్ని పుస్తకాలు తెమ్మని చెబుతాను. షాపువాడు నేను యివ్వమన్న పుస్తకాలు యిస్తాడు. ఆలివర్ వాటిని సక్రమంగా ఇంటికి తెస్తాడో లేదో చూద్దాం!" అన్నాడు బ్రౌన్‌లో.

"ఆ కుర్రవాడు తిరిగిరాడు! అలా చూస్తూ ఉండు!....షాపువద్ద పుస్తకాలు తీసుకుంటాడు. ఆ తర్వాత పుస్తకాలను మరొకచోట అమ్మేస్తాడు. ఆ డబ్బు జేబులో వేసుకుని పలాయనం చిత్తగిస్తాడు." అన్నాడు గ్రిమ్‌విగ్ నవ్వుతూ.

"అలా ఎన్నటికీ జరగదు! ఆలివర్ చాలా మంచి కుర్రవాడు" అన్నాడు బ్రౌన్‌లో.

5

ఆలివర్ పోలీసులకు చిక్కిన విషయం ఫాగిన్‌కి తెలిసింది. అతడు డాడ్జర్ బేట్స్‌లమీద విపరీతంగా మండిపడ్డాడు.

"ఆలివర్ ఎక్కడున్నాడు?" ఫాగిన్ గర్జించాడు.

అదే సమయంలో ఒకవ్యక్తి పరిగెత్తుకుంటూ లోనికి వచ్చాడు వాడి పేరు బిల్‌సైకెస్! వాడుకూడా ఫాగిన్ దొంగల ముఠాలో ఒక సభ్యుడే!

"పూర్తి శిక్షణ పొందకుండా ఆలివర్‌ని వాళ్ళవెంట పంపడం నీది పొరపాటు!" అన్నాడు బిల్‌సైకెస్ ఫాగిన్‌తో.

"ఆలివర్ మన కార్యకలాపాలను రహస్యాలను ఈ పాటికి పోలీసులకు చెప్పే ఉంటాడు. ఇక మనమంతా కష్టాల ఊబిలో ఇరుక్కున్నట్టే!" అన్నాడు సైకెస్ మళ్ళీ.

"ఎలాగైనాసరే ఆలివర్‌ని పోలీస్‌స్టేషన్ నుంచి విడిపించాలి. మీలో సమర్థులైనవారు ఆ ప్రయత్నమేదో చూడండి!" అన్నాడు ఫాగిన్.

"నేను వెళ్తానంటూ ఎవరూ ముందుకు రాలేదు."

"ఇటువంటి విషయాలలో 'నాన్సీ' చాలా సమర్థురాలు వేషాలు మార్చి ఎదుటి వారిని బోల్తా కొట్టించడంలో ఆ అమ్మాయి ఘటికురాలు." అన్నాడు సైకెస్.

నాన్సీ దొంగల ముఠాలో ఒకే ఒక స్త్రీ సభ్యురాలు!

ఉన్నత వంశంలోని ధనవంతురాలిగా నాన్సీ వేషం మార్చుకుంది. తిన్నగా పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి "ఏడీ నా చిన్న తమ్ముడు? ఎక్కడ ఉన్నాడు?" అని

అడిగింది.

"ఇక్కడ చిన్న పిల్లలు ఎవరూ లేరు మేడమ్!" అన్నాడు ఇన్స్‌పెక్టర్.

"అయితే మీరు నేరారోపణ చేసి తీసుకొచ్చిన నా తమ్ముడు ఆలివర్ ఏమైనట్టు?" అడిగింది నాన్సీ దర్పంగా.

"ఓ పెద్ద మనిషి మీ తమ్ముణ్ని పెంటోవిల్లిలో వున్న తన ఇంటికి తీసుకు వెళ్ళాడు మేడమ్!" అని చెప్పాడు పోలీసు అధికారి.



బ్రౌన్‌లో తీసుకు రమ్మన్న పుస్తకాలు షాపునుండి తెస్తుండగా, నాన్సీ అనే దొంగల తాలూకు అమ్మాయి వచ్చి ఆలివర్‌ని పరిచయమున్న దానివలె కాగలించు కొనుట!

"ఆలివర్ ఇక మన దగ్గరకు రాడు! రావడానికి అంగీకరించడు. అతడివల్ల

మనకు ఎప్పటికయినా ప్రమాదమే! కనుక ఆలివర్‌ని రహస్యంగా ఎత్తుకు రావడమే మంచిది” అన్నాడు ఫాగిన్.

బిల్ సైకెస్, నాన్సీలకు ఏదో రహస్యం చెప్పాడు ఫాగిన్. వాళ్ళకు కొంత ధనమిచ్చి సాగనంపాడు.

ఆలివర్, బ్రౌన్‌లో తీసుకు రమ్మన్న పుస్తకాలు తేవడానికి పుస్తకాల షాపుకి బయలుదేరాడు. సైకెస్, నాన్సీలు నీడలా ఆలివర్‌ని అనుసరించారు.

ఆలివర్ పుస్తకాల షాపుకి వెళ్ళాడు. బ్రౌన్‌లో రాసియిచ్చిన ఉత్తరాన్ని పుస్తకాలషాపు యజమానికి యిచ్చాడు. షాపు యజమాని కొన్ని పుస్తకాలు ఆలివర్‌కి యిచ్చాడు.

ఆ పుస్తకాలను తీసుకుని ఆలివర్ తిరిగి ఇంటికి బయలుదేరాడు. సైకెస్, నాన్సీలు తిరిగి అతన్ని అనుసరించారు.

నాన్సీ పరిగెత్తుకుంటూ వచ్చి “ఓ నా ప్రియమైన సోదరుడా! చివరకు నిన్ను కలుసుకోగలిగినందుకు ఎంత ఆనందిస్తున్నానో తెలుసా?” అంటూ ఆలివర్‌ని బిగియారా కౌగలించుకుంది.

వీధి మధ్యలోని దృశ్యాన్ని చూసిన జనం విషయమేమిటో తెలుసుకుందామని వాళ్ళచుట్టూ గుమిగూడేరు.

“అయ్యలారా! వీడి దుడుకుతనం చూసారా? అల్లారుముద్దుగా చూసుకునే తల్లిదండ్రులనుకాదని ఇంటినుండి పారిపోయి వచ్చాడు. ఏం తక్కువైందని వీడికి? చివరకు దొంగలముఠాలో చేరాడు. ఆ విషయం నా తల్లికి తెలిసింది. ఆమె తః కొడుకుకోసం గుండెలు పగిలేలా దుఃఖిస్తున్నది. ఇంటికి వెళ్ళమని మీరయినా చెప్పండి” అంది నాన్సీ కంటతడి పెట్టుకుంటూ.

“అన్నీ ఉండికూడా నీకిదేం పోయేకాలం. తిన్నగా ఇంటికి వెళ్ళు. బుద్ధిగా చదువుకో!” అంది గుంపులోవున్న ఒక యువతి.

“కనిపెంచిన తల్లిదండ్రులను బాధపెట్టకూడదు నాయనా!” అంది మరొక యువతి.

ఆలివర్ నాన్సీ చేతులనుండి విడిపించుకుంటూ “నాకు తల్లిదండ్రులెవరూ లేరు. నేను అనాధబాలుణ్ని” అన్నాడు బిగ్గరగా.

అంతలో సైకెస్ తన కుక్కతో అక్కడ ప్రత్యక్షమయ్యాడు.

జనాన్ని తొలగించుకుంటూ ముందుకొచ్చి “ఓ ఆలివర్ నువ్వా!....ఇంటికి

వెళ్ళవయ్యా నాయనా! మీ అమ్మ నీకోసం ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి పడిపోయింది" అన్నాడు సైకెస్.

ఆలివర్‌కి విషయం అర్థమైంది.

"అయ్యలారా! నన్ను రక్షించండి! వీళ్ళెవరో నాకు తెలియదు. నాకు అమ్మా నాన్నా లేరు! వీళ్ళు నన్ను తీసుకువెళ్ళకుండా రక్షించండి! నా మానాన నన్ను పోనివ్వండి" అన్నాడు ఆలివర్ బాధగా.

"అరె! నీ చేతిలోని ఆ పుస్తకాలు ఎక్కడివి? దొంగతనం చేసావన్న మాట!....నీ బుద్ధి మారదురా రాస్కెల్!" అంటూ సైకెస్ ఆలివర్ చేతిలోని పుస్తకాలు బలవంతంగా లాక్కున్నాడు.

తర్వాత ఆలివర్ జేబులు వెదికాడు. ఒక జేబులోవున్న అయిదు పౌండ్ల నోటును కూడా వాడు తీసేసుకున్నాడు.

"పుస్తకాలు తీసుకోవద్దు. ఆ పుస్తకాలు నన్ను దయతో చూస్తున్న ఓ పెద్దమనిషివి. మీకు కావలసింది నేను. నన్ను తీసుకువెళ్ళండి. ఆ పుస్తకాలు, డబ్బు తిరిగి ఆ పెద్దమనిషికి అందజేయండి. లేకపోతే ఆ దయామయుడి దృష్టిలో నేనొక మోసగాడిగా, దొంగగా మిగిలిపోతాను. ఆపదలోవున్న మరొకరిని అతడు ఎన్నటికీ చేరదీయడు" అన్నాడు ఆలివర్ ఏడుస్తూ.

"నోరు మూస్తావా, లేదా? ఇంకొక్క మాట నీ నోటివెంట వచ్చిందో, కుక్కను నీ మీదికి ఉసిగొల్పుతాను. అది నీ కండలు పీకిపారేస్తుంది. బుద్ధిమంతుడిలా మాతో బయలుదేరు!" అన్నాడు సైకెస్ కోపంగా.

నాన్సీ సైకెస్‌ని వారిస్తూ "నువ్వు చంపాలనుకుంటే ముందుగా నన్ను చంపు. ఆలివర్ మీదికి కుక్కను ఉసిగొల్పావంటే నేను ఊరుకునేది లేదు" అంది.

ముగ్గురూ కలిసి ఫాగిన్ వద్దకొచ్చారు!

"అయితే నువ్వు మా నుండి తప్పించుకుని, పారిపోదామనుకుంటున్నావన్నమాట!....మా రహస్యాలన్నీ పోలీసులతో చెప్పి, మమ్మల్ని ఖైదు చేయించుకుంటున్నావన్నమాట! అవునా?" అంటూ గర్జించాడు ఫాగిన్.

ఆలివర్ ఏదో చెప్పబోయాడు. అతడి నోటి నుండి మాట యివతలికి రాక ముందే ఫాగిన్ చేతిలోని దుడ్డుకర్రతో ఆలివర్ తలమీద బలంగా కొట్టాడు.

క్రింద పడిపోయిన ఆలివర్ తలను ఒడిలోకి తీసుకుంటూ బాధగా నాన్సీ యిలా అంది :

"ఏదోవిధంగా పిల్లవాడిని వెనక్కి తీసుకొచ్చాం!.... ఇప్పుడు చావుదెబ్బ కొట్టవలసిన అవసరం ఏం వచ్చింది? ఏమీ తెలియని పసివాడిని దొంగగా తయారు చేసారు. అది చాలదా మీకు? ఆలివర్ కంటే యింకా చిన్నవయసులోనే నాచేత దొంగతనాలు చేయించారు. నేను మీ జేబులు నింపాను. అంతే! నన్ను స్వేచ్ఛగా



ఆలివర్ తన దగ్గరకు రాగానే, కోపంతో ఫాగిన్ కుర్రవాడి తలమీద కొట్టుట!

విడిచిపెట్టలేదు మీరు. నేను శాశ్వతంగా మీ వద్దనే దొంగగా మిగిలిపోయాను. అంత కంటే ఏం కావాలి మీకు?.... వెళ్ళండి! ఈ కుర్రవాడిని ఒంటరిగా వదిలి వెళ్ళండి!"

నాన్సీ ఆలివర్‌ని కౌగలించుకుని పెద్దగా రోదించసాగింది.

"చాలు నాన్సీ!.... ఇక ఆపు!" అంటూ ఫాగిన్, బేట్స్ దిక్కు తిరిగి "చూడు ఛార్లీ! ఆలివర్‌ని మంచంమీద పడుకోబెట్టి గాయానికి మందు వెయ్!.... అతడి శరీరం మీద వున్న అందమైన దుస్తులు తీసేసి, మన దుస్తులు తొడిగించు! తిరిగి ఆలివర్ ఎన్నటికీ ఆ దుస్తులు ధరించకూడదు. జాగ్రత్త!" అన్నాడు.

## 6

మిస్టర్ బంబెల్, లండన్ నగరంలో న్యాయపరమైన వ్యవహారాలు చూసుకుని, తిరిగి స్వస్థలానికి బయలుదేరాడు. అతడికి ఓ బ్రాందీ షాపులో వార్తాపత్రికలో ప్రకటించబడిన ప్రకటన ఒకటి కనిపించింది—

అందులో యిలా ఉంది : "ఆలివర్ ట్విస్ట్ అనబడే పిల్లవాడి గురించిన, సమాచారం అందించిన వారికి అయిదు గిన్నీల బహుమానం యివ్వబడుతుంది.

ఆలివర్ ట్విస్ట్ అనబడే యీ కుర్రవాడు తన ఇంటి నుండి పారిపోవడమో లేక అపహరింపబడటమో జరిగింది. ఆ కుర్రవాడి ఆచూకీ యింతవరకు తెలియలేదు. గత వారం రోజులుగా కనిపించకుండా పోయిన, ఈ ఆలివర్ ట్విస్ట్ ఎక్కడ ఉన్నదీ, లేక అతడి గత జీవితం గురించి కానీ సమాచారం అందజేసిన వారికి బహుమానం యివ్వబడుతుంది."

ఆలివర్ ఎలా ఉండేదీ, దాని తాలూకు రూపవర్ణన, ఆ ప్రకటన యిచ్చిన బ్రౌన్‌లో ఇంటి అడ్రస్సూ వార్తా పత్రికలో స్పష్టంగా ఉన్నాయి.

మిస్టర్ బంబెల్ బ్రౌన్‌లో అడ్రసు తీసుకుని అతడి ఇంటికొచ్చాడు.

తనకు ఆలివర్ విషయంలో ఏమి తెలుసో, అతడు ఎక్కడ, ఎవరికి, ఏ పరిస్థితిలో జన్మించిందీ, ఎక్కడ నుండి పారిపోయి వచ్చిందీ, అన్నీ బ్రౌన్‌లోకి వివరంగా చెప్పాడు బంబెల్!

"ఆలివర్ గురించి మీరు యిచ్చిన సమాచారానికి కృతజ్ఞతలు! ఇదుగో మీ బహుమానం! అయిదు గినీలు తీసుకోండి!" అన్నాడు బ్రౌన్‌లో.

బంబెల్ డబ్బు తీసుకుని వెళ్ళిపోయాడు.

"చాలా చక్కని కుర్రవాడు. అందమైన ముఖం. నెమ్మదస్తుడు. ప్రేమించదగ్గవాడు" అంది మిసెస్ బెడ్‌లిన్.

"వాడి విషయంలో నీవేమైనా ఊహించుకో!....అది నీ యిష్టం!....కానీ ఈ ఇంటిలో మరొక్కసారి ఆలివర్ పేరు వినబడిందంటే నాకంటే చెడ్డవాడు మరొకడు ఉండడు జాగ్రత్త!" అని ఇంటి పని మనిషిని హెచ్చరించాడు బ్రౌన్‌లో.

7

ఒకనాటి రాత్రి సైకెస్‌ని కలుసుకునేందుకు ఫాగిన్ అతడి ఇంటికి వెళ్ళాడు. నాన్సీ అక్కడే ఉంది.

"మనం మాట్లాడుకున్న దొంగతనం గురించి ఏమిటి ఆలోచించావు? మనం ఇంటిలోపలనుండి వ్యవహారం చక్కదిద్దలేకపోతే, బయటినుండి పని పూర్తి



బిల్ సైకెస్, ఆలివర్‌ని తీసుకురమ్మన్నాడని చెప్పడానికి నాన్సీ వచ్చుట.

చేయగలమేమో ఆలోచించావా?" అన్నాడు ఫాగిన్ సైకెస్‌తో.

"ఇది చాలా కష్టసాధ్యమైన వ్యవహారంవలె కనిపిస్తున్నది" అన్నాడు సైకెస్ ఆలోచిస్తూ.

"అనుకున్న దానికన్నా ఎక్కువగానే ముట్టజెబుతాను. ఈ పని ఎంత కష్టసాధ్యమైనాసరే పూర్తి చేయాలి" అన్నాడు ఫాగిన్.

"బయటనుండి గోడ ఎగబ్రాకి పై అంతస్థులోవున్న చిన్న కిటికీని సమీపించి దానిలోనుండి దూరి లోనికివెళ్ళడం చిన్నవాడైన ఆలివర్‌కే సాధ్యమవుతుంది. ఈ వ్యవహారాన్ని మనం రేపు రాత్రికే పూర్తి చేయాలి" అన్నాడు ఫాగిన్ మళ్ళీ.

"అలాగే! అయితే నువ్వూ నాన్సీ కలిసి ఆలివర్‌ని నా దగ్గరకు తీసుకురండి!" అన్నాడు సైకెస్.

నాన్సీ గదిలో అడుగుపెట్టే సమయానికి ఆలివర్ ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు.

పుస్తకంలోనుంచి తలెత్తి "ఏమిటి విషయం?" అన్నాడు ఆలివర్.

నాన్సీ భారంగా ఓ కుర్చీలో కూలబడి "భగవంతుడు నన్ను క్షమిస్తాడనే అనుకుంటున్నాను. ఎందుకంటే ఈ పథకం నాది కాదు. ఇందులో నా ప్రమేయం ఏదీలేదు. బిల్ సైకెస్ నిన్ను తన ఇంటికి తీసుకురమ్మన్నాడు" అంది.

"దేనికి?" ఆలివర్ ప్రశ్నించాడు.

"ఎందుకైనాసరే! అతడు చెప్పినట్టు చెయ్! నోరు మెదపకు. వాడు పరమ నీచుడు. తన ప్రాణాలు రక్షించుకునేందుకు నిన్ను చంపడానికిగూడ వెనుదీయడు జాగ్రత్త!"

"నాతో ఏమిటి వాడికి పని?"

"చాలా ప్రమాదకరమైన పని అది" అంటూ చెప్పి, నాన్సీ ఆలివర్‌ని తీసుకుని వీధిలోకి వచ్చింది.

చుట్టూ చీకటిగా వుంది. వీధిలో జనసంచారం అంతగాలేదు.

'ఇదే మంచి అదను! పిక్కబలంకొద్దీ పారిపోతే ఎలా ఉంటుంది? లేదా సహాయంకోసం పెద్దగా కేకలుపెడితే స్వేచ్ఛను పొందగలనేమో!' అనుకున్నాడు ఆలివర్.

వాళ్ళిద్దరూ నడుస్తున్నారు. ఆలివర్ మనసులో అనేక ఆలోచనలు.

"చూడు ఆలివర్! నువ్వు ఏం ఆలోచిస్తున్నావో నాకు తెలుసు. ఊహించుకోగలను. కానీ నువ్వు పారిపోవటానికి ఇది సరియైన సమయం కాదు. కొద్దికాలం ఓపికపట్టు" అంది నాన్సీ.

ఇద్దరూ సైకెస్ ఇంటికొచ్చారు. వాళ్ళు చూస్తుండగానే సైకెస్ పిస్టల్ తీసి దానిలో గుండ్లు నింపాడు.

తర్వాత పిస్టల్‌ని ఆలివర్‌కి గురిపెట్టి "ఈ ఆయుధం ఎటువంటిదో నీకు బాగా తెలుసుననుకుంటాను. నా నుంచి తప్పించుకుని పారిపోవాలని చూసినా



టాబీక్రాకెట్, బిల్ సైకెస్‌లు ఆలివర్‌ని దొంగతనం చేయడానికి తీసుకు వచ్చుట.

లేక ఎటువంటి అలజడి రేపినా దీని గుండ్లు నీ గుండెల్లో దిగబడతాయి." అన్నాడు సైకెస్.

సైకెస్ పిస్టల్‌ని కోటుజేబులో భద్రపర్చుకున్నాడు. తర్వాత ఆలివర్‌ని వెంటబెట్టుకుని వీధిలోకి వచ్చాడు.

ఆఖరు సారిగా ఆలివర్ నాన్సీ వంక చూసాడు. ఆ చూపులో దీనత్వం కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నది. ఆ చూపులను తట్టుకోలేని నాన్సీ బాధగా తలను ప్రక్కకు తిప్పుకుంది.

8

అప్పుడు ఉదయం అయిదు గంటలు కావస్తున్నది ఆ చీకట్లో ఆలివర్ సైకస్ కలిసి ప్రయాణం సాగించారు. ఆ పగలంతా ప్రయాణం చేసి, చీకటి పడే సమయానికి శిథిలావస్థలో వున్న ఓ ఇంటి సమీపానికి వచ్చారు.

ఆ ఇల్లు ఒక నదిఒడ్డున వుంది. సైకస్ ఆలివర్‌ని తీసుకుని లోపలికి వెళ్ళాడు. ఆ ఇంటిలో వున్న వ్యక్తి పైప్ తాగుతూ ఆలివర్ వంక ప్రశ్నార్థకంగా చూసాడు.

ఆ వ్యక్తి పేరు 'టాబీక్రాకెట్!....' ఇతడు కూడా ఫాగిన్ దొంగల ముఠాలో ఒక సభ్యుడే!

"ఎవరీ కుర్రవాడు?" టాబీ అడిగాడు.

"ఇతడి పేరు ఆలివర్ ట్విస్ట్!....ఫాగిన్ కుర్రవాళ్ళలో ఒకడు!" జవాబు చెప్పాడు సైకస్.

ఆ తర్వాత సైకస్ టాబీ దగ్గరగా వంగి అతడి చెవిలో ఏదో రహస్యంగా చెప్పాడు. టాబీ లేచి వెళ్ళి తన పిస్టల్ తెచ్చుకున్నాడు.

ముగ్గురూ కలిసి రోడ్డుమీదికి వచ్చారు!

చుట్టూ గాఢాంధకారం పొగమంచు కురుస్తున్నది. ముగ్గురూ నడక సాగించారు. ఆలివర్ వాళ్ళిద్దరి మధ్యా నడుస్తున్నాడు.

కొంత సేపటికి వాళ్ళొక ఇంటి సమీపానికి వచ్చారు. ఆ ఇంటి చుట్టూ పెద్ద ప్రహరీగోడ రక్షణ వలయంగా కనిపిస్తున్నది.

టాబీ అతికష్టం మీద గోడమీదికి అధిరోహించాడు. క్రింద నిలుచున్న సైకస్ ఆలివర్‌ని పైకెత్తి టాబీకి అందించాడు. తర్వాత అతడు కూడా గోడ మీదికి ఎక్కాడు.

వాళ్ళు ఏం చేయబోతున్నదీ ఆలివర్‌కి అప్పుడర్థమైంది. 'వీళ్ళు పెద్ద ఇంటికి కన్నం వేయాలని వచ్చారు. ఇల్లంతా కొల్లగొట్టడమో లేక ఎవరినైనా హత్యచేయడమో చేస్తారు. దొరికిపోతే ఉరిశిక్ష కానీ యావజ్జీవ ఖైదుగానీ తప్పదు.' అనుకున్నాడు ఆలివర్.

తక్షణం అతడికి శరీరంలో వణుకు ప్రారంభమైంది.

"ఏమండీ! మీకు నమస్కారం చేస్తాను. నన్ను వదిలేయండి. నేను దూరంగా వెళ్ళిపోతాను. మీ విషయం పోలీసులకు చెప్పను. నా ప్రాణం పోయినా సరే చెప్పను. నా మీద జాలి చూపించండి. నన్ను యీ దొంగతనంలో యిరికించ కండి మీకు పుణ్యముంటుంది!" అన్నాడు ఆలివర్ భయపడుతూ.

సైకస్ పిస్టల్ తీసి ఆలివర్ తలకు గురిపెట్టి "చెప్పిన పనిచెయ్! లేకపోతే నిష్కారణంగా చస్తావు!" అన్నాడు.

ఆ ఎత్తైన గోడకు సమానంగా ఇంటి తాలూకు చిన్న కిటికీ వుంది. కిటికీకి బయట వేపున బలమైన ఇనుప జల్లెడ అమర్చబడి వుంది. టాబీ తన బలమంతా ఉపయోగించి పనిముట్ల సహాయంతో ఆ ఇనుప జల్లెడను తొలగించాడు.

అక్కడ చిన్న కిటికీ ఉంది. ఆ కిటికీ గుండా ఆలివర్ లాంటి సన్నటి కుర్రవాడు మాత్రమే దూరి లోనికి వెళ్ళగలడు.

తన వెంట తెచ్చిన చిన్నలాంతరు వెలిగించి దానిని ఆలివర్‌కిస్తూ "లాంతరు పుచ్చుకుని కిటికీగుండా లోనికివెళ్ళు. జాగ్రత్తగా ఇంటి ముందుకు చేరుకుని, ముందున్న తలుపులు తెరు!" అని ఆజ్ఞాపించాడు సైకెస్.

ఆలివర్ కిటికీగుండా దూరి గది నేలమీదికి దూకాడు. తర్వాత ఇంటిముందు భాగానికి వెళ్ళి నెమ్మదిగా తలుపులు తెరిచాడు. అక్కడే నిలబడి ఉన్న సైకెస్, టాబీలు లోనికి ప్రవేశించారు.

వాళ్ళు నెమ్మదిగా హాలులోనికి వచ్చారు. ఆలివర్ ఒక నిర్ణయానికి వచ్చాడు.

"వీళ్ళు నన్ను చంపినా సరే, ఇంటి వాళ్ళను యీ ప్రమాదం నుంచి కాపాడాలి. వాళ్ళంతా పైభాగంలో నిద్రపోతూ ఉండొచ్చు. నెమ్మదిగా పైకి వెళ్తాను. నిద్రపోతున్న వారిని హెచ్చరిస్తాను." అనుకున్నాడు ఆలివర్. అతడి పాదాలు ముందుకు నడిచాయి.

"వెనక్కి వచ్చెయ్! వెనక్కి!" ఆలివర్ వెనుకనుంచి సైకస్ అరిచాడు.

అదే సమయంలో మేడపై భాగంనుండి ఎవరో పెద్దగా అరిచిన కేక వినిపించింది. దానితో ఆలివర్ భయపడి చేతిలోవున్న లాంతరును చప్పున క్రిందికి వదిలేసాడు. ఆలివర్‌కి అదే కేక మళ్ళీ వినిపించింది. మరుక్షణంలో లైట్లు వెలిగాయి. ఇద్దరు వ్యక్తులు సగంవరకే ఉన్న దుస్తులు ధరించి మెట్ల పైభాగాన నిలబడి ఉండటం

ఆలివర్ కంటబడింది.

మరుక్షణం ఏదో మెరుపు మెరిసినట్లయింది. తర్వాత పెద్దశబ్దం వినిపించింది. సైకెస్ పిస్టల్ తీసి పై అంతస్తు మెట్లదగ్గర నిలుచున్న ఇద్దరు మీదికి పేల్చాడు ....తర్వాత రక్తం కారుతున్న ఆలివర్‌ని వెనక్కి ఈడ్చుకుంటూ వెళ్ళాడు.



ఇంటి నౌకర్లలో ఒకడు కాల్చిన పిస్టల్ గుండు వచ్చి ఆలివర్‌కి తగులుట.

కొంతసేపటివరకూ అరుపులూ, కేకలూ, పిస్టల్ కాల్పులూ ఆలివర్‌కి వినిపించాయి.

ఆ తర్వాత ఆలివర్ స్పృహ కోల్పోయాడు!....

## 9

ఏ అనాథ శరణాలయంలో ఆలివర్ ట్విస్ట్ జన్మించాడో అక్కడ మిసెస్ కార్నే నర్స్‌గా పనిచేస్తున్నది. చర్చికి సంబంధించిన అధికారులలో ఒకడైన మిస్టర్ బంబెల్. ఈ మధ్యకాలంలో తరుచూ రావడం సాగించాడు.

మిసెస్ కార్నే భర్త ఇరవై అయిదు సంవత్సరాల క్రితం మరణించాడు. అప్పటినుండి ఆమె విధవగానే కాలం వెళ్ళబుచ్చుతున్నది. బంబెల్‌కి వివాహం కాలేదు. ఒంటరిగానే ఉంటున్నాడు. మిసెస్ కార్నేని వివాహం చేసుకోవాలన్నది అతడి ఉద్దేశం!

ఇద్దరూ కలిసి టీ తాగారు! అంతలో ఓ వృద్ధురాలు వాళ్ళున్న దగ్గరకు వచ్చింది.

"రోగగ్రస్తురాలైన ముసలిది సాల్లీ చివరిదశలో ఉంది మిసెస్ కార్నే!.... ఆమె నిన్ను తక్షణం చూడాలంటున్నది. చనిపోయేముందు మీకొక ముఖ్యమైన విషయం చెప్పాలట!" అని చెప్పింది వృద్ధురాలు.

మిసెస్ కార్నే లోనికి వెళ్ళింది. అవసానదశలోవున్న ఓ వృద్ధురాలు మంచంమీద పడుకుని బాధతో మెలికలు తిరిగిపోతున్నది.

ఇద్దరు సేవకులు ఆమె మంచం దగ్గర నిలబడి ఉపచర్యలు చేస్తున్నారు.

"ఇదుగో ముసలిదానా!....నీలాగ చచ్చేవాళ్ళ మంచాలవద్ద నిలబడి ఉండటానికి నాకు వ్యవధిలేదు. నోరుమూసుకుని పడుకో! ఘడియకో క్షణానికో దేవుడి దగ్గరకు వెళ్ళిపోతావులే!" అంటూ మిసెస్ కార్నే వెనుదిరిగింది.

మంచంమీద పడుకునివున్న ముసలిది శక్తినంతా కూడదీసుకుని "వెళ్ళకు! ఇలా నా దగ్గరకు రా! నీ చెవిలో ఒక విషయం చెబుతాను. చనిపోయేముందు నన్ను ప్రశాంతంగా చావనీయ్!" అంది.

మిసెస్ కార్నే వెనుదిరిగి వచ్చింది!

"ఒకప్పుడు నేను కూడా నీలాగే యిక్కడ నర్సుగా పనిచేసాను. ఇదే గదిలోకి అందమైన ఓ యువతి తీసుకురాబడింది. ఆమె అప్పుడు నిండుచూలాలు. ఆమె ఒక మగశిశువును ప్రసవించి చనిపోయింది. ఆమె చనిపోయేముందు ఆమె వద్దనున్న వాటిని నేను దొంగిలించాను" ముసలిది ఆయాసపడుతూ చెప్పింది.

"ఏమిటి నువ్వు దొంగిలించింది?" మిసెస్ కార్నే ఉత్సాహంగా అడిగింది.

"మగపిల్లవాడిని ప్రసవించిన ఆ యువతి చాలా పేదస్థితిలో ఉంది. బట్టలు

మాసిపోయి, చిరుగులుపట్టి ఉన్నాయి. సరియైన తిండిలేక బాగా బక్కచిక్కి ఉంది. అయినా ఆమె ఆ విలువైన వస్తువును అమ్ముకోలేదు. దానిని జాగ్రత్తగా దాచి పెట్టింది."

"ఏమిటా విలువైన వస్తువు?" అడిగింది మిసెస్ కార్నే.



చావుబ్రతుకులమధ్య కొట్టుకుంటున్న ముసలిది ఆలివర్ తల్లియొక్క రహస్యాన్ని మిసెస్ కార్నేతో చెప్పుట.

"అదొక స్వచ్ఛమైన బంగారపు వస్తువు!" ముసలిది చెప్పింది.
"చెప్పు చెప్పు! ఏమిటా బంగారపు వస్తువు?"
"ఆమె ఆ వస్తువును నాచేత బెట్టింది. తనకోసం దానిని జాగ్రత్తగా

ఉంచమని ప్రాధేయపడింది. ఆమె నన్ను నమ్మింది. అయితే పిల్లవాడిని ప్రసవించగానే చనిపోయింది. బహుశా ఆ కుర్రవాడుకూడా ఆ తర్వాత చనిపోయి ఉండొచ్చు. దానికి కారణం నా పేరాశ కారణం కావచ్చు. నా అలక్ష్యం కావచ్చు! ఆ బంగారాన్ని నేను సక్రమంగా వినియోగించి వుంటే పిల్లవాడు క్షేమంగా ఉండే



రాత్రి జరిగిన దొంగతనం గురించి ఫాగిన్, చార్లీ బేట్స్, డాడ్జర్ మాట్లాడుకుంటుండగా టాబీక్రాకిట్ తలుపులు తీసుకుని లోనికి వచ్చుట!

వాడేమో. ఆ పిల్లవాడు అచ్చం తల్లిపోలికే!.... పాపం ఆ తల్లి ఎంత దురదృష్టవంతురాలు!....చాలా చిన్నవయసులోనే మరణించింది" వృద్ధురాలు ఆయాసపడుతూ చెప్పింది.

"ఊఁ....తర్వాత!....తర్వాత ఏం జరిగింది?"

"ఆమె చనిపోయేముందు నన్ను దగ్గరకు రమ్మని చెప్పింది నా చెవిలో. నా కొడుకు బ్రతకాలి!....పెద్దవాడైన తర్వాత తన తల్లి పేరు చెప్పుకోడానికి సిగ్గుపడ కూడదు. నా కొడుక్కి ఎవరూ లేరు. సహృదయులెవరైనా వాడిని పెంచి తమ ప్రేమను అందించాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను-అని చెప్పింది. ఆ తర్వాత ఆమె శాశ్వతంగా కన్నుమూసింది" అంది వృద్ధురాలు.

"ఆమెకు పుట్టిన కుర్రవాడి పేరేమిటి?" మిసెస్ కార్నే ప్రశ్నించింది.

"అనాథ శరణాలయం అధికారులు కుర్రవాడికి ఆలివర్ ట్విస్ట్ అని నామ కరణం చేసారు."

"నువ్వు దొంగిలించిన బంగారం....ఏం చేసావు?"

ముసలిది అతి కష్టంమీద "తాకట్టు షాపులో........" ఇక ఆపైన ఆమె నోటి నుండి మాటరాలేదు. ఆమె గొంతులోనుండి ఏవో శబ్దాలు వెలువడ్డాయి. తర్వాత వెక్కిళ్ళు ప్రారంభమై మరుక్షణంలో తల వెనక్కి వాల్చేసింది.

"చచ్చింది ముసలిది!" అంటూ మిసెస్‌కార్నే ముసలిదాని చేతిలో వున్న చిన్న కాగితం ముక్కను లాక్కుని జేబులో పెట్టుకుంది.

తర్వాత తలుపులు తెరుచుకుని యివతలికి వచ్చి బైట వేచివున్న యిద్దరు సేవకులతో "ముసలిది చనిపోయింది. ఆ వ్యవహారమేదో చూడండి!" అని చెప్పి మిసెస్ కార్నే అవతలికి వెళ్ళిపోయింది.

## 10

ఫాగిన్, ఛార్లీబేట్స్ డాడ్జర్ గదిలో కూర్చుని ఉన్నారు. రాత్రి జరిగిన దొంగతనం ఫలితమేమిటో తెలుసుకోవాలన్న ఆతృత ముగ్గురి ముఖాలలోనూ స్పష్టంగా కనిపిస్తున్నది.

అంతలో టాబీకాకిట్ విసురుగా గదిలోకి వచ్చాడు.

"బిల్ సైకెస్ ఎలా ఉంది?" అని అడిగాడు.

"ఏమిటీ!.... ఏం జరిగింది టాబీ? సైకెస్ ఆలివర్ ఎక్కడున్నారు? వాళ్ళు యిక్కడికి ఎందుకురాలేదు?" ఫాగిన్ ఆతృతగా అడిగాడు.

"మన దొంగతనం విజయవంతంకాలేదు. ఆలివర్‌కి పిస్టల్ గుండు తగిలింది. సైకెస్ కుర్రవాడిని యీడ్చుకొచ్చి ఓ గోతి దగ్గర పడేసి వెళ్ళాడు." అని చెప్పాడు టాబీ.

ఫాగిన్ విసురుగా బయటికి వెళ్ళిపోయాడు. తిన్నగా 'త్రీక్రిపిల్స్' బ్రాందీషాపువద్ద కొచ్చాడు. సైకెస్ తరుచూ అక్కడికి వస్తూ ఉంటాడు.

"సైకెస్ యిక్కడికి వచ్చాడా?" షాపు యజమానిని అడిగాడు ఫాగిన్.



మంక్స్ అనేవాడు ఫాగిన్‌కి అప్పగించిన కార్యం ఏమైందో తెలుసుకు నేందుకు ఫాగిన్ గదికి వచ్చుట.

"రాలేదు మిస్టర్ ఫాగిన్!"

"మంక్స్ కూడా రాలేదా?" ఒక వ్యవహారం గురించి అతడితో మాట్లాడాలి." అన్నాడు ఫాగిన్.

"ఇంకా రాలేదు. పదినిముషాలలో 'మంక్స్, యిక్కడికి రావచ్చు. మిస్టర్ ఫాగిన్!" అన్నాడు షాపు యజమాని.

ఆ తర్వాత ఫాగిన్. నాన్సీని కలుసుకుని దొంగతనం ఫలప్రదం కాలేదని చెప్పాడు.

జరిగిన విషయం ఆమెతో చెప్పి "ఒకవేళ సైకస్ ఆలివర్‌ని తీసుకు రాకుండా ఒంటరిగా వస్తే మాత్రం సైకెస్‌ని కొల్చిచంపేసెయ్!" అన్నాడు ఫాగిన్ కోపంగా.

నాన్సీ చాలా బాధపడుతూ "ఇప్పటికే నేను దొంగగా ముద్రపడ్డాను. దయచేసి నన్ను హంతకురాలిని కూడా చేయకు మిస్టర్ ఫాగిన్! ఆపని మరొకరికి అప్పగించు!....ఇక ఆలివర్ విషయమంటావా? పిస్టల్ గుండు దెబ్బకు చనిపోయి ఉంటాడనే భావిస్తున్నాను." అంది.

ఏం చేయాలో ఫాగిన్‌కి అర్థం కాలేదు. అతడు ఇంటికి తిరిగి వచ్చాడు. అక్కడ అతడి ఇంటివద్ద అనాకారిగా నల్లగా వున్న ఒక వ్యక్తి ఫాగిన్ కోసం ఎదురు చూస్తూ నిలబడి ఉన్నాడు.

"నీ కోసం రెండు గంటల నుండి ఎదురు తెన్నులు చూస్తున్నాను ఎక్కడికి వెళ్ళావు?" ఫాగిన్‌ని ప్రశ్నించాడు ఆ వ్యక్తి.

"నీ పనిమీదనే వెళ్ళాను. రాత్రంతా ఆ పని మీదనే గడిచింది. ఆ విషయాన్ని ఇక్కడ చర్చించుకోవడం మంచిదికాదు. లోనికి వెళదాం. పద మిస్టర్ మంక్స్" అంటూ ఫాగిన్ ఇంటిలోనికి దారితీసాడు.

"నువ్వు ఈ దొంగ తనాన్ని బాగా ఆలోచించి పకడ్బందీగా తయారు చేయ లేదని నా అనుమానం." అన్నాడు మంక్స్.

ఫాగిన్ మాట్లాడలేదు.

ఆలివర్‌ని యిక్కడే ఉంచి చక్కని దొంగగా దేనికి తయారు చేయలేదు? ....లేదా, మరొక విధంగా అరెస్ట్ చేయించి జీవితమంతా జైలులో శిక్ష అనుభవించే టట్టు చేసినా బాగుండేది కదా! ఆలివర్ విషయంలో నేను అనుకుంటున్న, నా లక్ష్యం నెరవేరేది కదా!" అన్నాడు మంక్స్ చిరాకుపడుతూ.

"నువ్వు వెదుకుతున్న కుర్రవాడు ఇతడేనని తెలిసిన తర్వాత నీవు చెప్పి నట్టుగానే ఆలివర్‌కి దొంగతనాలు ఎలా చేయాలో నేర్పించాను. అతడిని పోలీసులు తీసుకు వెళ్ళారు. అయితే ఓ వ్యక్తి కోర్టునుండి ఆలివర్‌ని తన ఇంటికి తీసుకు

వెళ్ళాడు. అయితే ఆలివర్‌ని అక్కడనుంచి అపహరించి తెచ్చాము. ప్రస్తుత పరిస్థితుల్లో ఆలివర్ చనిపోకుండా బ్రతికి ఉంటే నేను తప్పకుండా అతడ్ని ఆరి తేరిన దొంగగా తయారు చేస్తాను." అన్నాడు ఫాగిన్.

"ఆలివర్ ఒకవేళ చనిపోతే ఏం చేయడానికి గూడ ఏమీ ఉండదు. హత్య లంటే నాకు మొదటి నుంచీ యిష్టంలేదని నీకు తెలుసు. మనిషి ఎన్ని మోసాలైనా చేయవచ్చు కానీ హత్యలు మాత్రం చేయకూడదు. అది మహా నేరమని నేను భావి స్తాను." అంటూ మంక్స్ కిటికీలోనుండి బైటికి తొంగి చూసాడు.

"ఎవరది?" అన్నాడు బిగ్గరగా.

"ఎవరూ?" అడిగాడు ఫాగిన్.

"ఎవరిదో స్త్రీ ఆకారం!.... కిటికీవద్ద తచ్చాడుతూ కనిపించింది. చీకటిలో ఆ ఆకారం ఎవరిదో గుర్తించ లేకపోయాను" అన్నాడు మంక్స్.

వెంటనే ఇద్దరూ గది యివతలికి పరిగెత్తుకుంటూ వచ్చారు. వీధిలో అటు యిటు పరీక్షగా చూసారు.

అయితే వాళ్ళకు ఆ స్త్రీ ఆకారం కనిపించలేదు.

## 11

కొన్నిగంటల తర్వాత ఆలివర్‌కి స్పృహ వచ్చింది. తన ఎడమచేతికి రక్తపు మరకలున్న బాండేజ్ కట్టబడి ఉండటం చూసుకున్నాడు. ఎడమచేతికి తగిలిన దెబ్బ అతడిని బాధపెట్టసాగింది. నెమ్మదిగా లేచి దగ్గరగా కనిపిస్తున్న ఇంటి సమీపానికి వచ్చాడు.

ఆ ఇల్లు రాత్రి వాళ్ళు దొంగతనానికి వచ్చిన ఇల్లే!.... ఆలివర్ నెమ్మదిగా ఇంటి తలుపుతట్టాడు. ఇద్దరు సేవకులు తలుపులు తీసి చూసారు.

"ఆ కుర్రవాడే!.... బాగా గాయపడ్డాడు. ఈ కుర్రవాడు కూడా ఆ దొంగ లలో ఒకడు. నేను ఈ కుర్రవాడిని పిస్టల్‌తో కాల్చాను. మనం యీ కుర్రవాడు చనిపోకుండా చూడాలి." అన్నాడు గిల్లెస్ అనే సేవకుడు.

"దేనికి?" అని అడిగాడు బ్రిట్టిల్స్ అనే రెండో సేవకుడు.

"దేనికేమిటి!.... ఇతడు చేసిన నేరానికి యీ కుర్రవాడు ఉరికంబానికి వ్రేళ్ళాడుతూ ఉండగా చూడాలని ఉంది." అన్నాడు మొదటి సేవకుడు.

ఆలివర్‌ని ఇద్దరు సేవకులు కలిసి ఇంటిలోపలికి తీసుకొచ్చి మంచంమీద పడుకోబెట్టారు.

ఆ ఇంటి యజమానురాలు డాక్టర్ కోసం కబురు పంపింది. ఆ ఇంటిలో ఇద్దరు ఆడవాళ్ళు ఉన్నారు. పెద్దావిడ పేరు మిసెస్ మేలీ!.... చిన్నావిడకు పదిహేడు సంవత్సరాలు ఉంటాయి. ఆమె పెద్దావిడకు మేనకోడలు అవుతుంది. ఆమె పేరు 'రోసి'!



ఏ ఇంటికైతే రాత్రి వచ్చి దొంగతనం చేయబోయారో ఆ ఇంటి వాళ్ళే ఆలివర్‌ని కాపాడుట!....

డాక్టర్ లాస్‌బెర్నీ తక్షణం వచ్చి ఆలివర్ గాయాన్ని కడిగి కట్టుగట్టాడు.

గాయాన్ని చూసిన మిసెస్ మేలీ బాధపడుతూ "ఎంత హృదయవిదారకమైన సంఘటన! ఈ కుర్రవాడు రాత్రి మన ఇంటిలో దొంగతనానికి వచ్చిన దొంగ

లకు శిష్యుడై ఉంటాడు.” అంది.

“పాపం! చాలా చిన్న పిల్లవాడు. బహుశా తల్లి ప్రేమ అంటే ఏమిటో తెలియని కుర్రవాడిలా కనిపిస్తున్నాడు. బహుశా నేరాల ఊబిలోకి బలవంతాన నెట్టబడి ఉంటాడు. లేదా నేరాలు చేయడానికి ఇతడి ఆకలి బాధ అయినా పురిగొల్పి ఉండాలి. ఈ కుర్రవాడిని పోలీసులకు అప్పగించే ముందు యీ విషయమై మనం బాగా ఆలోచించాలి. ఇది ఏమీ తెలియని ఒక అమాయక బాలుడి జీవితానికి సంబంధించిన విషయం!” అంది రోసీ జాలిగా.

కొద్ది రోజులకే ఆలివర్ గాయం నయమైంది. ఆలివర్ తన గతజీవితం తాలూకు కథను మిసెస్ మేలీకి వినిపించాడు. అది విన్న రోసీ దుఃఖాన్ని ఆపుకో లేక బిగ్గరగా ఏడ్చేసింది.

“ఈ కుర్రవాడికి మనం ఏదో ఒక సహాయం చేయాలి!” అంది రోసీ.

ఇద్దరు ఇంటి నౌకర్లు మొదట ఆలివర్‌ని పోలీసులకు అప్పగించాలనే అనుకున్నారు. కాని, పోలీసు అధికారులు, దొంగతనం విషయంలో పరిశోధన చేయడానికి వచ్చినప్పుడు ఆలివర్ విషయం ఇంటిలోని వారెవ్వరూ పోలీసులకు చెప్పలేదు.

ఆలివర్ ఆరోగ్యం బాగుపడింది. ఆలివర్ తమ ఇంటిలో ఒక సభ్యుడైనట్టే అందరూ అతణ్ని ఎంతో ప్రేమగా ఆదరించారు.

ఆలివర్ గతజీవితం తెలిసిన డాక్టర్ లాస్‌బర్నీ, కుర్రవాడి కోరిక మేరకు ఒకనాడు మిస్టర్ బ్రౌన్‌లో ఇంటికి తీసుకు వెళ్ళాడు.

మిస్టర్ బ్రౌన్‌లోకి, తనకు ఏం జరిగిందో చెప్పాలనీ, తాను పుస్తకాలు తీసుకొస్తుండగా దొంగలు తన వద్దనున్న పుస్తకాలు తీసుకొని, తనని ఎత్తుకుపోయిన సంగతి వివరించాలని ఆలివర్ ఉద్దేశం!

అయితే ఏం లాభం?....బ్రౌన్‌లో ఉంటున్న ఇల్లు ఖాళీగా వుంది. ముందు భాగాన ఉన్న తలుపుకు ‘అద్దెకు యివ్వబడును’ అన్న బోర్డు వాళ్ళకు కనిపించింది.

“మిస్టర్ బ్రౌన్‌లోగారు ఎక్కడికి వెళ్ళారో మీకేమైనా తెలుసా?” ప్రక్కింటి వారిని అడిగాడు డాక్టర్ లాస్‌బర్నీ.

“మిస్టర్ బ్రౌన్‌లో తన సామానుతోసహా ఆరు వారాలక్రితం వెస్టిండీస్‌కి బయలుదేరి వెళ్ళారు. అతడి ఇంటి వ్యవహారాలు చూసే వ్యక్తి మిస్టర్ బెడ్‌విన్, బ్రౌన్‌లో స్నేహితుడైన మిస్టర్ గ్రిమ్‌విగ్ కూడా అతడి వెంట వెస్టిండీస్‌కు

వెళ్ళారు."

ఆలివర్ నిరాశతో తిరిగి వచ్చాడు. అయినా అతడు ఇంటిపనులలో మిసెస్ మేలీకి, రోసీకి సహాయం చేస్తూ కాలం గడపసాగేడు—

రోసీ చక్కగా పియానో వాయించేది. ఆలివర్ ఆనందంగా వింటూ కూర్చునేవాడు. రోజులు ఆనందంగా దొర్లిపోతున్నాయి.



ఆలివర్‌ని కొట్టడానికి వచ్చిన మంక్స్ ఆలివర్ తప్పించుకోగా నేలమీద పడుట—

అదే సమయంలో రోసీకి జ్వరం వచ్చింది. ఎన్ని మందులు వాడినా ఆమెకు జ్వరం తగ్గలేదు. నానాటికీ ఎక్కువ కాసాగింది. రోసీ బాగా చిక్కిపోయింది.

మంచం మీదనుండి లేవలేని స్థితికి వచ్చింది.

మిసెస్ మేలీ అక్కడికి నాలుగు మైళ్ళ దూరంలో వున్న డాక్టర్ లాస్ బెర్నీకి ఉత్తరం రాసింది.

ఆ ఉత్తరాన్ని ఆలివర్ చేతికిచ్చి "చూడు ఆలివర్! ఈ ఉత్తరాన్ని తీసుకు వెళ్ళి పోస్టుమేన్‌కి యివ్వు" అని చెప్పింది.

ఆలివర్ ఉత్తరాన్ని తీసుకుని, పెద్దవీధిలో ఉన్న హోటల్ వద్దకు వచ్చాడు. పోస్టుమేన్ గుర్రం మీద అక్కడికి వస్తాడు. ఆలివర్ హోటల్ ప్రక్కగా నిలుచుని, పోస్టుమేన్ కోసం చూస్తూ నిలుచున్నాడు.

అదే సమయంలో ఒక వ్యక్తి హోటల్ లోపలనుండి, విసురుగా పరిగెత్తుకుంటూ ఆలివర్ నిలబడిన దగ్గరకు వచ్చాడు. అతడు తనవేపు చూస్తున్న భయంకర చూపులకు ఆలివర్ ఎంతో భయపడిపోయాడు.

"లోకంలో ఉన్న అశుభాలన్నీ నీ నెత్తిమీద విరుచుకుపడాలి. మృత్యు దేవత నీ గుండెల మీద నాట్యం చేయాలి. నువ్వు నా కంటికి చిన్నభూతం వలె కనిపిస్తున్నావురా కుర్రవెధవా! నీ కారణంగా నాకు మనశ్శాంతి లేకుండా పోయిందిరా!"

ఆ వ్యక్తి అలా తిడుతూనే ఆలివర్‌ని కొట్టడానికి బిగించిన పిడికిలిని వేగంగా పైకెత్తాడు. ప్రమాదాన్ని ముందే కనిపెట్టిన ఆలివర్ తక్షణం వెనుదిరిగి మెరుపుతీగెలా పరుగు లంఘించుకున్నాడు.

కొంతదూరం వచ్చిన తర్వాత ఆలివర్ తల వెనక్కి తిప్పి చూసాడు.

ఏముంది!....ఆలివర్‌ని కొట్టబోయిన వ్యక్తి నేలమీద బోర్లాపడి ఉన్నాడు. తనను కొట్టబోయి, నేలమీద పడిపోయిన ఆ వ్యక్తిని చూసి ఆలివర్ సంతోషంతో చప్పట్లు కొట్టాడు.

ఉత్తరం అందుకుని డాక్టర్ లాస్‌బర్నీ వచ్చాడు. రోసీని చూసి పెదవి విరిచాడు. రోసీ మామూలు మనిషి కావడానికి ఎక్కువ ఆశలు కనిపించడంలేదని చెప్పాడు.

మిసెస్ మేలీ, ఆలివర్, ఇంటిలోని వారు అంతా దుఃఖసాగరంలో మునిగిపోయారు.

"నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. ఆపైన భగవంతుని దయ" అన్నాడు డాక్టర్.

రోసీ సుగతనిద్రలో మునిగిపోయింది. మూడు పగళ్ళు, మూడు రాత్రులూ

ఆమె మూసిన కన్ను తెరువలేదు. డాక్టర్ లాస్‌బర్న్, రోసీని కనిపెట్టుకుని ఆమె మంచం వద్దనే ఉన్నాడు. ఆ ఇంటిలోని వారెవ్వరికీ, కంటిమీద కునుకు లేదు.

నాలుగవ రోజున ఉదయాన్నే డాక్టర్ యివతలికి వచ్చాడు. అందరి ముఖాల్లోనూ ఉత్కంఠ చెలరేగింది.

డాక్టర్ నవ్వుతూ "మరేం భయంలేదు. రోసీ కళ్ళు తెరిచింది. ప్రాణాపాయమేదీ లేదు. గండం గడిచినట్లే!" అని చెప్పాడు.

ఆలివర్ ఎంతో సంతోషించాడు. రోసీకి పూలు బహుమానంగా యిద్దామనుకున్నాడు. అవి తీసుకురావటానికి, ఇంటి వెనుకగా ఉన్న తోటలోకి వెళ్ళాడు.

అతడు పూలు కోసుకుని తిరిగి లోనికి వస్తుండగా సన్నగా, పొడవుగా, అందంగా ఉన్న యువకుడొకడు గుర్రపు బండి దిగుతూ కనిపించాడు.

ఆ యువకుడు మిసెస్ మేలీ కుమారుడైన 'హారీ!'

అతడు ఇంట్లోకి వస్తూనే తల్లితో "ఏమిటమ్మా నువ్వు చేసిన పని? రోసీకి జ్వరం వచ్చినప్పుడే నాకెందుకు తెలియజేయలేదు?....ఇప్పుడైనా నాకు కబురు చేయడం?....బాగుందమ్మా! చాలా బాగుంది. రోసీకి ఏదైనా జరిగితే....నేను భరించలేనని నీకు తెలుసుకదా అమ్మా!" అన్నాడు ఉద్వేగంతో.

"నువ్వేమో రోసీని వివాహం చేసుకుంటానంటావు. రోసీ తల్లిదండ్రులెవరో, వాళ్ళ వంశం ఏమిటో మనకు తెలియదు. నువ్వు ఆమెను వివాహం చేసుకున్న తర్వాత మానసికంగా బాధపడవలసి వస్తుందేమో ఆలోచించు నాయనా! నువ్వు రోసీని ఎంతగా ప్రేమిస్తున్నావో. నేను కూడా అంతగానే ప్రేమిస్తున్నాను. అయితే లోకులు ఊరుకోరు గదా! రోసీ గతజీవితాన్ని నీకు గుర్తు చేస్తూ ఉంటారు. నువ్వు బాధపడతావు. రోసీ బాధపడుతుంది. చివరకు మీ వివాహబంధం నాశనమవుతుంది" అంది మిసెస్ మేలీ.

"రోసీ నా ప్రాణం! ఆమె గతజీవితం, జన్మవృత్తాంతం ఎటువంటిదైనా నేను బాధపడను. ఆమె అంగీకరిస్తే సంతోషంగా వివాహం చేసుకుంటాను" అన్నాడు మిస్టర్ హారీ.

ఆ రోజు సాయంత్రం ఆలివర్ తోటలో వున్న బెంచీ మీద కూర్చుని ఆలోచించసాగేడు. అతడి కళ్ళు మగతగా మూతలు పడుతున్నాయి.

అదేసమయంలో ఫాగిన్ అతడి ముందు ప్రత్యక్షమయ్యాడు.

"ఇక్కడేం చేస్తున్నావు? రా, నాతో వచ్చేసెయ్! ఊఁ!....బయలుదేరు!"

ఫాగిన్ గొంతు వింటూనే ఆలివర్ కళ్ళు తెరిచి చూసాడు.

అంతలో మరొక వ్యక్తి నవ్వుతూ ఫాగిన్ వెనుకగా వచ్చాడు. ఆలివర్ ఆ వ్యక్తిని గుర్తుపట్టాడు. హోటల్ వద్ద తను ఉత్తరం పోస్టుమేన్‌కి యిచ్చేందుకు వెళ్ళినప్పుడు, తనను తిట్టి కొట్టబోయిన వ్యక్తి అతడే!



తోటలో బల్లమీద కూర్చున్న ఆలివర్‌ని తీసుకు వెళ్ళేందుకు, ఫాగిన్ వచ్చుట.

వెంటనే ఆలివర్ సహాయంకోసం పెద్దగా అరిచాడు. వెంటనే వాళ్ళిద్దరూ చెట్లమధ్యగుండా పారిపోయారు. ఆలివర్ కేకలు విని మిస్టర్ హారీ, ఇంటి నౌకరు పరిగెత్తుకుంటూ వచ్చారు. ఆలివర్ వాళ్ళతో విషయమేమిటో చెప్పాడు.

వాళ్ళు ఇద్దరూ తోటంతా గాలించారు. వాళ్ళకు ఎక్కడా మనుషుల అలికిడి కనిపించలేదు. మిస్టర్ హారీకి ఆలివర్ జీవితం గురించి తెలుసు.

"బహుశా నువ్వు బల్లమీద కూర్చుని కళ్ళు మూసుకుని ఉంటావు. ఆ నిద్రలో కలవచ్చి ఉంటుంది. కలలో ఫాగిన్ కనిపించి ఉంటాడు" అన్నాడు హారీ నవ్వుతూ.

"లేదు లేదు! నిజంగానే ఫాగిన్ నాముందు ప్రత్యక్షమయ్యాడు. నేను పోస్టు చేయడానికి వెళ్ళినప్పుడు నన్ను కొట్టబోయిన వ్యక్తిగూడ ఫాగిన్ వెంట ఉన్నాడు. వాళ్ళతో నన్ను రమ్మని గుడ్లురిమి చూసారు. నాకు భయంవేసి సహాయం కోసం అరిచాను" అన్నాడు ఆలివర్.

## 12

మిస్టర్ బంబెల్, మిసెస్ కార్నేని వివాహం చేసుకున్నాడు. వివాహం చేసుకున్న కొద్దిరోజులకే అతడి అదృష్టం పంటి అనాథశరణాలయానికి యజమాని అయ్యాడు.

ఒకనాడు బంబెల్ ఏదో విషయంమీద భార్యతో తగువుపెట్టుకున్నాడు. తర్వాత తిన్నగా బ్రాందీషాపుకి వెళ్ళి తాగుతూ కూర్చున్నాడు. ఆ బ్రాందీషాపులో ఒకే ఒక్కడు కూర్చుని ఉన్నాడు. అతడు పొడవుగా, నల్లగా అసహ్యకరంగా ఉన్నాడు. అతడి చూపులు చాలా తీక్షణంగా ఉన్నాయి.

అతడు చేతిలోవున్న గ్లాసుతో బంబెల్ కూర్చున్న బల్లవద్ద కొచ్చి కూర్చుంటూ "మీరు నాకోసమే చూస్తున్నారనుకుంటాను" అన్నాడు.

"లేదు! నేను ఎటో చూస్తున్నాను."

"నేను మిమ్మల్ని ఎక్కడో చూసాను. ఆఁ....జ్ఞాపకం వచ్చింది. మీరు యిక్కడ చర్చి తాలూకు అధికారులు కదూ!" అన్నాడా వ్యక్తి.

"అవును!....కానీ యిప్పుడు నేను శరణాలయానికే అధికారిని!—" అన్నాడు బంబెల్.

ఆ వ్యక్తి నవ్వి "ఓహో! ఎంత అదృష్టం. వెదుకబోయిన తీగే కాలికి తగిలినట్టుంది. నేను మీకోసమే చూస్తున్నాను" అన్నాడు.

"ఏమిటి విషయం?"

"మీనుండి నాకొక ముఖ్యమైన సమాచారం కావాలి. అందుకు నేను మీకు కొంతధనం యిస్తాను" అన్నాడా వ్యక్తి.

అసడమేకాదు కొన్ని నాణేలుతీసి టేబిల్ మీద ఉంచాడు. బంచెల్ అటు యిటు చూసి చకచకా ఆ నాణేలు తీసుకుని జేబులో వేసుకున్నాడు.

"పన్నెండేళ్ళక్రితం ఓ యువతి మీ శరణాలయంలో మగపిల్లవాడిని ప్రసవించి చనిపోయింది. ఆ పిల్లవాడి సంరక్షణా భారాన్ని చర్చి అధికారులు స్వీకరించారు."



మంక్స్, ఆలివర్ పుట్టుపూర్వోత్తరాలను బంచెల్ కు డబ్బిచ్చి తెలుసుకొనుట!

బంచెల్ నవ్వి "అటువంటి పరిస్థితులు, సంఘటనలు చాలామందికి జరుగుతూ ఉంటాయి" అన్నాడు.

"నిజమే! కానీ ఆ యువతికి పుట్టిన పిల్లవాడు తెల్లగా పాలిపోయి చాలా

## 13

మంక్స్ ఇచ్చిన చిరునామా ప్రకారం మిస్టర్ బంచెల్ భార్యన బెట్టుకుని అతడి ఇంటికొచ్చాడు. ఆ ఇల్లు నదిఒడ్డున వుంది. మంక్స్ భర్తల్ని చూస్తూనే "పైకిరండి!" అంటూ ఆహ్వానించాడు.

ఆ ఇంటిపై అంతస్థుకు మెట్లులేవు. నిచ్చెన మీదినుండి వాళ్ళను పైకి తీసుకు వెళ్ళాడు. పైన చిన్నగది వుంది. ఆ గదిలో బల్ల మూడు ఉన్నాయి.

ముగ్గురూ కూర్చున్న తర్వాత "ఉపోద్ఘాతం లేకుండా సూటిగా మాట్లాడుకుందాం!.... చూడండి మిసెస్ బంచెల్....ఆ మంత్రసాని చ ముందు మీకు ఏం చెప్పింది?" అని అడిగాడు మంక్స్.

"నేను చెప్పబోయే సమాచారం మీకు ఎంత విలువైనదో తెలుసు వుంది!" అంది మిసెస్ బంచెల్.

"ఆ సమాచారం ఎంత విలువైనదో నేను యిప్పుడు చెప్పలేను. ఆ చెప్పే సమాచారాన్నిబట్టి ఉంటుంది" అన్నాడు మంక్స్.

"నేను చెప్పే సమాచారం ఏదయినా కానీయ్! నేను ఇరవై పౌండ్ల బంగారాన్ని మీనుండి తీసుకుంటాను" అంది మిస్ బంచెల్.

మంక్స్ ఇరవైఅయిదు పౌండ్ల బంగారం ఆమెచేత పెట్టాడు.

అప్పుడు మిసెస్ బంచెల్ యిలా చెప్పింది.

"ఆ మంత్రసాని చనిపోయేముందు ఆమె గదిలో మేమిద్దరం వున్నాము. ఆలివర్ తల్లి విషయం నాతో చెప్పింది. ఆలివర్ తల్లి చనిపోగా వద్ద వున్న విలువైన వస్తువులను మంత్రసాని దొంగిలించింది. వేటినైతే మ దొంగిలించిందో వాటిని ఆలివర్ తల్లి భద్రంగా తన కొడుకుకోసం దాచి ఎన్నిబాధలు పడినాసరే వాటిని ఆలివర్ తల్లి అమ్ముకోలేదు."

"ఏమిటా వస్తువులు?"

"బంగారు ఆభరణం!"

"ఆ మంత్రసాని దానిని ఏం చేసింది? అమ్మేసిందా? ఎవరికి? ఎ ఆతృతగా అడిగాడు మంక్స్.

"ఆ విషయమే నాతో చెబుదామనుకుంది. కానీ చెప్పకముందే విరుచుకుపడి చనిపోయింది" అంది మిసెస్ బంచెల్.

"ఏమీ చెప్పకుండానే చనిపోయిందా? నేను నమ్మను. నువ్వు అబద్ధం చెబుతున్నావు" అన్నాడు మంక్స్.

"నిజమే చెబుతున్నాను. ఆమె నాతో ఏమీ చెప్పకుండానే చనిపోయింది. అయితే చనిపోయేముందు తన చేతితో నా గౌను పుచ్చుకుంది. ఆ చేతిలో చిన్న కాగితంముక్క ఉంది."



ఆలివర్ తల్లికి సంబంధించిన బంగారపులాకెట్, ఉంగరం మంక్స్ చూచుట !

"ఏమిటది?" అడిగాడు మంక్స్.

"అది ఏదో తాకట్టుకొట్టుకు సంబంధించిన కాగితం. ఆ మంత్రసాని దగ్గర ఏదైతే ఉందో దానిని డబ్బుకోసం షాపులో తాకట్టుపెట్టి ఉంటుంది" అని వివరించి

చెప్పింది మిసెస్ బంచెల్.

"సరే! ఆ తర్వాత ఏం చేసావ్?"

"నేను ఆ తర్వాత తాకట్టుషాపుకి వెళ్ళాను. మొత్తం సొమ్ము, దానికి అయిన వడ్డీ కట్టేసి బంగారపు ఆభరణాన్ని తీసుకొచ్చాను."

"అది ఇప్పుడెక్కడుంది?"

"ఇక్కడ, నా దగ్గరే ఉంది" అంటూ మిసెస్ బంచెల్ చిన్నపెట్టెను తీసి యిచ్చింది.

అందులో పెళ్ళి ఉంగరం, చిన్నలాకెట్ ఉన్నాయి. లాకెట్ బిళ్ళమీద 'ఆగ్నెస్' అనే పేరు చెక్కి వుంది. ఆ పేరు ప్రక్కన ఖాళీస్థలం వదిలివేయబడి వుంది. ఆమె వివాహం చేసుకునివుంటే అక్కడ భర్త పేరు వస్తుంది. ఆ తర్వాత లాకెట్ మీద తారీఖు చెక్కబడి వుంది. ఆలివర్ పుట్టినరోజుకు ఒక సంవత్సరం ముందు తారీఖు అందులో వుంది.

లాకెట్, పెళ్ళి ఉంగరం చూసిన తర్వాత మంక్స్ ముఖంలో సంతృప్తి కనిపించింది— మరుక్షణం అతడు ఒక్కుదుటున పైకి లేచాడు. తనముందున్న బల్లను పైకెత్తి అవతలికి విసిరేసాడు. బల్లదిగువన చెక్క నేలమీదవున్న తలుపు నొకదానిని తెరిచాడు. దానిలోనుండి క్రింద ప్రవహిస్తున్న నది కనిపిస్తున్నది.

మంక్స్ వెనుకా ముందూ చూడకుండా తన చేతిలోవున్న చిన్నపెట్టెను చెక్కతలుపుగుండా నదిలోకి విసిరివేసాడు.

విలువైన వస్తువులువున్న ఆ చిన్నపెట్టె నది నీటిలో కొట్టుకుపోయింది.

అతడు చేస్తున్న పని ఆ దంపతులిద్దరూ చూస్తూ ఉండిపోయారు.

"ఇదే మీకు చెబుతున్నాను. జ్ఞాపకం పెట్టుకోండి! ఈ రహస్యం మన ముగ్గురు మధ్యనే ఉండాలి. నాలుగవ వ్యక్తికి తెలియ గూడదు." అన్నాడు మంక్స్.

మిస్టర్ బంచెల్ మిసెస్ బంచెల్ "అలాగే" నంటూ తలలు ఆడించారు.

## 14

"ఈ వారం అంతా కనిపించలేదు. ఎక్కడికి వెళ్ళావు ఫాగిన్?" తనని చూడటానికి వచ్చిన ఫాగిన్‌ని అడిగాడు బిల్ సైకెస్.

బిల్ సైకెస్ ఓ చిన్న గదిలో మంచంమీద పడుకుని వున్నాడు. అతడు ఎక్కడికీ వెళ్ళడంలేదు. దురదృష్టం అతడ్ని వెన్నంటి తరుముతోంది చేతిలో

చిల్లిగవ్వ లేదు. ఆకలి దప్పులు అతణ్ని బాధించసాగేయి.

"వేరే ఒకపని మీద లండన్ నగరం విడిచి వెళ్ళవలసి వచ్చింది. అందుకే యీ వారం రోజులూ నీకు కనిపించలేకపోయాను. అయినా నిన్ను నేను మరచిపోలేదులే!" అన్నాడు ఫాగిన్ నవ్వుతూ.



ఫాగిన్ మంక్స్ మాట్లాడుకున్న రహస్యాలన్నీ కిటికీ చాటున నిలబడి నాన్సీ వినుట!

"నాకు కొంత డబ్బు కావాలి! నాన్సీ లేకపోతే నేను ఆకలి చావు చచ్చేవాడిని! నాన్సీని నీ వెంట పంపిస్తాను. ఆమె చేతికి డబ్బు యిచ్చి పంపించు" అన్నాడు సైకెస్.

నాన్సీ ఫాగిన్‌తో బాటు అతడి ఇంటికి వచ్చింది. ఫాగిన్ ఆమెకు కొంత డబ్బు యిచ్చాడు. నాన్సీ ఆ డబ్బు లెక్కబెట్టుకుంటుండగా మంక్స్ అక్కడికి వచ్చాడు.

మంక్స్ ఫాగిన్ కలిసి మేడమీదున్న మరొక గదిలోకి వెళ్ళారు. వాళ్ళ రహస్య సమావేశంలో ఏదో విశేషముంటుందని గ్రహించిన నాన్సీ నెమ్మదిగా పైకి వెళ్ళి తలుపు దగ్గర నిలుచుంది.

వాళ్ళు గదిలో మాట్లాడుకున్న సంగతులన్నీ నాన్సీ విన్నది. ఆ సంభాషణ తాలూకు సారాంశాన్ని అర్థం చేసుకుంటూనే నాన్సీ ఎంతో భయపడి పోయింది. ఆమె ఆతృతగా క్రిందికి దిగివచ్చేసింది. ఆ తొట్రుపాటులో ఆమె కొన్ని నాణేలను అక్కడ వదిలి పెట్టేసింది.

పాలిపోయిన ముఖంతో ఆమె సైకెస్ ఇంటికి చేరుకుంది. ఫాగిన్ యిచ్చిన డబ్బును సైకెస్‌కి అందజేసింది. తన ముఖంలోని ఆందోళన సైకెస్ కనిపెట్టకుండా జాగ్రత పడింది.

అయినా సైకెస్ "ఏమిటలా ఉన్నావ్? ఏం జరిగింది? నీ ముఖం పాలిపోయి కళా విహీనంగా వుంది. ఏమిటి కారణం?" అని అడిగాడు.

"ఏం లేదు! ఒంట్లో నలతగా వుంది. అంతే!" అంది నాన్సీ.

ఆ రాత్రి సైకెస్ తాగే పానీయంలో నిద్ర మాత్రలు వేసింది. నాన్సీ అతడు గాఢ నిద్రలోకి జారుకున్న తర్వాత నాన్సీ బట్టలు ధరించి టోపీ పెట్టుకుని శాలువా కప్పుకుని ఇంటి నుండి బయలుదేరింది.

ఆమె వేగంగా నడక సాగించి లండన్‌కు పశ్చిమ భాగంలో చివరగా వున్న ఓ హోటల్‌కు చేరుకుంది.

"నేను తక్షణం మిస్ మేలీని చూడాలి." అంది నాన్సీ హోటల్ తలుపు వద్ద వున్న వ్యక్తితో.

అతడు నాన్సీ నినఖ శిఖపర్యంతం చూస్తూ వుండి పోయాడు.

"నేను తప్పకుండా ఆమెను చూడాలి. ప్లీజ్!" అంది నాన్సీ మళ్ళీ.

"నేను ఆమెతో మీరు ఎవరని చెప్పాలి?" అడిగాడు ఆ వ్యక్తి.

"నా పేరు చెప్పినా ఆమెకు తెలియదు."

"అయితే మీరు ఏ విషయం మాట్లాడటానికి వచ్చారో అదైనా చెప్పండి. ఆమెతో చెబుతాను."

"దానివల్ల కూడా ప్రయోజనం ఉండదు." అంది నాన్సీ.

హోటల్ తాలూకు పనిమనిషిచేత లోనికి కబురు పెట్టింది నాన్సీ, పని మనిషి తిరిగివచ్చి నాన్సీని లోనికి తీసుకువెళ్ళింది.

గదిలో రోసీ కూర్చుని ఉంది.



ఆలివర్ తాలూకు రహస్యాలను నాన్సీ, హోటల్‌లో ఉన్న రోసీతో చెప్పుట

"ఇక్కడ మిమ్మల్ని కలుసుకోవడం చాలా కష్టమనుకుంటాను. నాకు చాలా కోపం వచ్చింది. ఇక్కడి మనుషులు నా యెడల చూపించిన నిరాదరణకు వెనక్కి తిరిగిపోదామన్నంత ఆవేశంకూడా కలిగింది. నేను అలా వెళ్ళిపోతే ఆ తర్వాత

మీరు ఎంతో విచారించేవారు" అంది నాన్సీ.

"దయచేసి ఆ విషయాన్ని మరచిపోండి!.... మీరు నన్నుదేనికి చూడాలనుకుంటున్నారో అది చెప్పండి ముందు!" అంది రోసీ.

"మిస్టర్ బ్రౌన్‌లో ఇంటిలో క్షేమంగా ఉంటున్న ఆలివర్‌ని తిరిగి ఫాగిన్ దొంగల ముఠాలోకి బలవంతాన తీసుకొచ్చిన అమ్మాయిని నేనే!" అంది నాన్సీ.

"నువ్వా!!" రోసీ ఆశ్చర్యంగా అరిచింది.

"అవును!.... అంతేకాదు. నేను వాళ్ళ రహస్యం తెలుసుకుని, నీకు చెప్పడానికి యిక్కడికి వచ్చానని గానీ వాళ్ళకు తెలిస్తే నేను బ్రతికి ఉండను. అంతేకాదు. నీ దగ్గర ఉన్నవాళ్ళ ప్రాణాలకు గూడ రక్షణ ఉండదు." అంది నాన్సీ.

"ఏమిటి నువ్వంటున్నది?" అడిగింది రోసీ.

"మంక్స్ అనే పేరు గల వ్యక్తి నీకు తెలుసా?" అంది నాన్సీ.

"నాకు తెలియదు!"

"అతడికి నువ్వు తెలుసు! నువ్వు యీ హోటల్‌లో ఉన్న సంగతి కూడా మంక్స్‌కి తెలుసు." అంది నాన్సీ.

"నాకు అర్థమవుతున్నది.... చెప్పు?" అంది రోసీ.

"మీ ఇంటిలో దొంగతనం జరగటానికి ఏర్పాట్లు జరిగిన రోజున, దెబ్బ తగిలిన ఆలివర్‌ని మీరు ఆదరించారు. అది జరిగిన తర్వాత నాకు మంక్స్ మీద అనుమానం కలిగింది. మా దొంగల ముఠా తాలూకు యిద్దరు కుర్రవాళ్ళతో కలిసి ఉన్న ఆలివర్‌ని మంక్స్ ఒకసారి చూడటం తటస్థించింది. మంక్స్ ఏ కుర్రవాడి కోసమైతే గాలిస్తున్నాడో ఆ కుర్రవాడు ఆలివర్‌యేనని అతడు తెలుసుకున్నాడు. మంక్స్ ఆలివర్ కోసం దేనికి గాలిస్తున్నాడో దానికి కారణమేమిటో మాత్రం నాకు తెలియదు. అప్పటికి ఆలివర్ బ్రౌన్‌లో ఇంటివద్ద సురక్షితంగా ఉన్నాడు. మంక్స్, ఫాగిన్ వద్దకొచ్చి ఒక ఒడంబడిక చేసుకున్నాడు. ఆలివర్‌ని కనుక తిరిగి అక్కడ నుంచి తన దొంగల ముఠా పరిధిలోకి తీసుకువస్తే బోలెడంత డబ్బు యిస్తాననీ, ఆలివర్‌ని శాశ్వతంగా దొంగ క్రింద మార్చితే తనకు సంక్రమించే లాభంలో నుంచి పెద్దమొత్తాన్నే ముట్టజెబుతాననీ మంక్స్, ఫాగిన్‌తో చెప్పాడు." అంది నాన్సీ.

"ఒక దొంగగానా!! ఎందుకు? దేనికోసం?" ఆశ్చర్యపోతూ అడిగింది రోసీ.

"ఎందుకో నాకు తెలియదు. ఒకసారి మంక్స్, ఫాగిన్ మాట్లాడుకుంటుం

దగా నేను యీ విషయాలన్నీ విన్నాను. అప్పుడు కిటికీగుండా మంక్స్ నా నీడ చూసాడు. వాళ్ళు బయటికి వచ్చేసరికే నేను పారిపోయాను. ఆ తర్వాత మంక్స్‌ని నిన్న రాత్రి చూసాను.” అంది నాన్సీ.

“ఆ తర్వాత ఏం జరిగింది?”

“రాత్రి ఫాగిన్‌ని చూడటానికి మంక్స్ వచ్చాడు. వాళ్ళ సంభాషణ అంతా విన్నాను. ‘ఆలివర్ ఎవరో తెలియజెప్పే అసలైన ఆధారాలను నేను నదిలో పారేసాను’ అన్నాడు మంక్స్. ‘ఆ విధంగా మంత్రసాని దాచిపెట్టిన ఆధారాలను నీళ్ళపాలుచేసి చంపేసాను. ఇక ఆలివర్‌కి సంబంధించినంతవరకు అతడి ఆస్తి యావత్తూ నాకే చెందుతుంది’ ఆలివర్ దొంగవలె బ్రతకాలి. అతడు జైలుకు వెళ్ళాలి. అప్పుడు అతడి తండ్రి రాసిన వీలునామా ప్రకారం ఆస్తి యావత్తూ మంక్స్‌కే చెందుతుందట. ఆలివర్ దొంగగామారి జైలుకువెళ్ళినా పాతఖైదీగా ఉరితీయబడినా అది ఫాగిన్‌కు లాభసాటిబేరమవుతుందని మంక్స్ చెబుతున్నాడు” అంది నాన్సీ.

రోసీ తన చెవులను నమ్మలేకపోయింది.

“మీకు చెప్పవలసిన విషయం మరొకటుంది. మంక్స్ మాటలనుబట్టి ఆ విషయం తెలుసుకున్నాను. ఆలివర్ ఎవరోకాదు! మంక్స్‌కు చిన్నతమ్ముడేనట” అంది నాన్సీ.

“మంక్స్‌కి ఆలివర్ తమ్ముడా!....”

“అవును. మీకు శక్తివుంటే, డబ్బు ఖర్చు చేయగలిగితే ఆలివర్ ఎవరో అతడి వృత్తాంతమేమిటో ఆరా తీయండి!....ఇక నేను వెళ్తాను” అంటూ నాన్సీ లేచి నిలుచుంది.

“వాళ్ళు నిన్ను బాధలు పెడుతున్నప్పుడు, నిన్ను దొంగతనాలు చేయడానికి పురిగొల్పి చెడుమార్గంలో నడిపిస్తున్నప్పుడు, వాళ్ళ మూలంగా ఎప్పటికైనా నీ ప్రాణాలకు ముప్పు రావచ్చుననుకున్నప్పుడు ఎందుకు నీవు వెనక్కి వాళ్ళ దగ్గరకు వెళ్ళడం?....”

“తప్పదు! అది నా జీవితం!.... ఆ జీవితంలో నేను చాలాదూరం ప్రయాణం సాగించాను. వెనక్కి తిరిగి రాలేను” అంది నాన్సీ.

“నువ్వు విలువైన సమాచారం అందించావు. అయితే ఇది నువ్వు వెళ్ళిపోయిన తర్వాత మాకు ఏ విధంగా ఉపకరిస్తుంది. ఆలివర్‌కి ఏ విధంగా ఉపయోగపడుతుంది?” అంది రోసీ నాన్సీతో.

"నీకు తెలిసైన ఆత్మీయులు, స్నేహితులు చాలామంది ఉండొచ్చు. వాళ్ళతో కూలంకషంగా చర్చించండి. ఏం చేయాలో వాళ్ళతో ఆలోచించి ఒక నిర్ణయం తీసుకోండి! అయితే వాళ్ళు యీ రహస్యాలు బయటికి పొక్కకుండా మా సేవాళ్ళుగా మాత్రం ఉండాలి" అంది నాన్సీ.



బ్రౌన్‌లో ఎక్కడ ఉన్నదీ ఆలివర్ చెప్పగానే మిస్ రోసీ వెళ్ళి అతడిని కలుసుకొనుట—

"ఒకవేళ నీ అవసరం ఏదయినా మాకు కావలసివస్తే నిన్ను ఎక్కడ కలుసుకోవాలి? ఆ విషయం చెప్పు?" అంది రోసీ అర్థింపుగా.

"నేను ఒంటరిగానే వస్తాననీ, వెంట ఎవరినీ తీసుకురాననీ ఈ విషయం

ఎవరికీ చెప్పననీ నువ్వు వాగ్దానంచేస్తే నన్ను ఎక్కడ కలుసుకోవచ్చునో చెబుతాను" అంది నాన్సీ.

రోసీ ఆ విధంగా వాగ్దానం చేసిన తర్వాత "నేను ప్రతి ఆదివారం రాత్రి పదకొండు గంటలనుండి అర్ధరాత్రివరకూ లండన్ బ్రిడ్జిమీద షికారుగా నడిచి వెళ్ళడం అలవాటు నాకు!.... నేను హత్య చేయబడకుండా బ్రతికి వుంటే నువ్వు వచ్చే ఆదివారం రాత్రి లండన్ బ్రిడ్జిమీద తప్పకుండా కలుసుకోవచ్చు" అంది నాన్సీ.

"నువ్వు గౌరవప్రదమైన జీవితం గడపాలని నిశ్చయించుకుంటే అందుకు తగిన ధనసహాయం నేను చేస్తాను. కావనకు" అంది రోసీ.

"చిల్లిగవ్వకూడా నేను మీనుండి ఆశించను! భగవంతుడు మిమ్మల్ని రక్షించాలని కోరుకుంటున్నాను. సెలవు" నాన్సీ వడివడిగా హోటలు వెలుపలికి వచ్చింది.

శాలువను మెడనిండా కప్పుకుని, వడివడిగా ఆ చీకటిలో ముందుకు సాగి పోయింది.

## 15

బయటికి వెళ్ళిన ఆలివర్ సంతోషంతో పరిగెత్తుకుంటూ ఇంట్లోకి వచ్చాడు.

"ఏమిటా హడావిడి?" అంది రోసీ.

"ఈ రోజు నేను దయార్ద్ర హృదయుడైన మిస్టర్ బ్రౌన్‌లోను చూసాను" అన్నాడు ఆలివర్ సంతోషంగా.

"ఎక్కడ చూసావు?" అని అడిగింది రోసీ.

"ఆయన కోచ్ బండిదిగి ఓ ఇంట్లోకి వెళ్తుండగా చూసాను." అన్నాడు ఆలివర్.

"మనం వెంటనే వెళ్ళి ఆయనను కలుసుకోవాలి. మనకు సహాయం చేసే వారిలో ఆయన ముఖ్యుడని నా ఉద్దేశం!" అంది రోసీ.

వాళ్ళిద్దరూ కలిసి క్రావెన్ స్ట్రీట్‌కి వచ్చారు. బ్రౌన్‌లో అక్కడ ఓ ఇంటిలో వుంటున్నాడు.

రోసీ ఇంటి లోపలికి వెళ్ళింది. మిస్టర్ బ్రౌన్‌లో తన స్నేహితుడైన గ్రిమ్‌విగ్‌తో కలిసి స్టడీ రూమ్‌లో కూర్చుని వున్నాడు.

"నా పేరు రోజ్‌మేలీ!.... మీరు ఒకప్పుడు నా చిన్ని స్నేహితుడికి

ఎంతో సహాయం చేసారు. అతడి యెడల జాలి, దయ, చూపించారు. ఇప్పుడు ఆ పిల్లవాడు ఎలా ఉన్నాడో తెలుసు కోవాలని మీరు ఉత్సాహం చూపిస్తారని, నేను భావిస్తున్నాను. ఆ కుర్రవాడి పేరు 'ఆలివర్ ట్విస్ట్'."

కొన్ని నిముషాలవరకూ బ్రౌన్‌లో, ఆశ్చర్యంతో మాట్లాడలేక పోయాడు.

"చూడు అమ్మాయీ! ఆ కుర్రవాడి మీద నాకున్న చెడు అపోహను తొలగించగలిగే శక్తి నీ కున్నట్టయితే ఆలివర్ విషయంలో నీకు తెలిసిందేమిటో చెప్పు!.... ఆ కుర్రవాడు ఎక్కడున్నాడో తెలుసుకునేందుకు ఎన్ని విధా( ప్రయత్నించాలో అన్ని విధాల ప్రయత్నించాను. కానీ ప్రయోజనం లేకపోయింది." అన్నాడు బ్రౌన్‌లో.

ఆలివర్ గురించి అన్ని విషయాలూ రోసీ బ్రౌన్‌లోకి వివరించి చెప్పింది. ఆలివర్ బైట గుర్రపు బగ్గీలో కూర్చున్న సంగతి రోసీ చెప్పగానే బ్రౌన్‌లో గబగబా యివతలికి వచ్చాడు. బండిలో కూర్చున్న ఆలివర్‌ని చూసాడు. ఆలివర్ బండిదిగి వచ్చి బ్రౌన్‌లోని కాగలించుకుని ఏడ్చేసాడు.

"నీ కొచ్చిన భయమేమీలేదు మైడియర్ లిటిల్ ఫ్రెండ్! నేను ఉన్నాను కదా! నీకు న్యాయం చేకూర్చుతాను." అంటూ బ్రౌన్‌లో ఆలివర్‌ని బుజ్జగించాడు.

అందరూ వచ్చి తిరిగి స్టడీ రూమ్‌లో కూర్చున్నారు!

"ఇదంతా నాన్సీవల్లనే జరిగింది. ముందు ఆ అమ్మాయిని అరెస్ట్ చేయించాలి." అన్నాడు మిస్టర్ గ్రిమ్‌విగ్ కోపంగా.

"శాంతించు మై ఫ్రెండ్! ముందుగా మనం ఆలివర్ తల్లిదండ్రులు ఎవరో తెలుసుకోవాలి. అతడికి ఓ వంశం వున్నదనీ అతడు అనాథ కాదనీ మనం ఋజువు చేయాలి. మంక్స్‌ని మనం ఒంటరిగా పట్టుకుని అతని చేతయదార్థాని ఒప్పించాలి. ఏది ఏమైనా మంక్స్ దొంగల ముఠాలో సభ్యుడు మాత్రం కాడు. ముందుగా మనం నాన్సీని కలుసుకోవాలి. మంక్స్ అనేవాడు ఎవడో ఎలా ఉంటాడో ఆమె ద్వారా మనం తెలుసుకోవాలి. వాడు తరుచూ ఎక్కడకు వస్తుంటాడో ఏం చేస్తుంటాడో కూడా మనకు తెలియాలి." అన్నాడు బ్రౌన్‌లో.

మిస్ రోసీ మిస్టర్ బ్రౌన్‌లో మిస్టర్ గ్రిమ్‌విగ్ కూర్చుని ఏం చేయాలన్నది బాగా ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చారు. పకడ్బందీగా ఓ పథకం ఆలోచించారు.

"మన పథకాన్ని డాక్టర్ లాస్ బెర్నీకి మిసెస్ మేలీకి మిస్టర్ హారీకి

వివరించి చెబుదాం!....ఈ విషయంలో వాళ్ళ సహాయం కూడా మనకు అవసరం కావచ్చు. అయితే మనం ఏం చేస్తున్నదీ ఆలివర్‌కి మాత్రం తెలియకూడదు." అన్నాడు బ్రౌన్‌లో.

"ఆదివారం రాత్రి నాన్సీని కలుసుకునేందుకు రోసీ లండన్ బ్రిడ్జివద్దకు వెళుతుంది. అప్పుడు మనం కూడా అక్కడకు వెళ్ళి నాన్సీని కలుసుకోవడం చాలా



శవపేటికలు తయారు చేసే వాడివద్ద పనిచేసిన నోవా క్లేపోల్ ఓ యువతితో బ్రాందీ షాపులో వుండగా వాళ్ళతో ఫాగిన్ సంభాషించుట.

ముఖ్యం! మనం ఏం చేయబోతున్నదీ నాన్సీకి తెలియజేయడం మంచిది!" అన్నాడు బ్రౌన్‌లో.

అందరూ దానికి అంగీకరించారు!

## 16

శవపేటికలు తయారుచేసే సావర్‌బర్రీ వద్ద పనిచేసిన నోక్లేపోల్, అతడి స్నేహితురాలు కార్లోట్ ఉద్యోగాల కోసం వెదుక్కుంటూ లండన్ నగరానికి వచ్చారు.

వాళ్ళు ఒక వీధి గుండా వస్తుండగా ఒకచోట 'త్రీక్రిపోల్స్' బ్రాందీషాపు కనిపించింది. వాళ్ళు షాపులోకి వచ్చి ఒకమూలగా ఉన్న బల్ల దగ్గర కూర్చున్నారు.

క్లేపోల్, బీర్ తెమ్మని వెయిటర్‌తో చెప్పాడు.

"అటు చూడు మిస్టర్ ఫాగిన్!.... మన బార్‌కి పల్లెటూరి ముఖాలు వచ్చాయి." అన్నాడు బార్నే నవ్వుతూ.

"అటువంటి పల్లెటూరి ముఖాలంటే నాకు చాలా ఇష్టం!" అన్నాడు ఫాగిన్ ఏదో ఆలోచిస్తూ. "చూడు! చూడు! వాడి వెంటవచ్చిన ఆ పిల్లవాడి మాటలను ఎలా ఆలకిస్తున్నదో! ఇటువంటి అమాయకపు ఆడపిల్లల్ని తన చెప్పు చేతలలో ఎలా తిప్పుకోవచ్చునో, ఆ పల్లెటూరి మగవాళ్ళకు బాగా తెలుసు. నువ్వు గొడవ చేయకు. వాళ్ళు ఏం మాట్లాడుకుంటారో వినాలని ఉంది." అన్నాడు ఫాగిన్ బార్నేతో.

"నా అభిప్రాయం ఏమిటంటే మనిషన్నవాడు హుందాగా దర్జాగా బ్రతకాలి. శవపేటికలు తయారు చేస్తూ ఆ పల్లెటూళ్ళో అనామకంగా బ్రతకడం నాకిష్టంలేదు. అందుకే బాగా డబ్బు సంపాదించాలని లండన్ వచ్చాను. నాతోబాటు కష్టసుఖాలలో భాగం పంచుకోడానికి వచ్చిన నువ్వు కూడా దర్జాగా బ్రతకవచ్చు." అన్నాడు క్లేపోల్.

కార్లోట్ నవ్వి "నువ్వు చెప్పింది వినడానికి బాగానే ఉంటుంది. అది ఉద్యోగం దొరికినప్పటి మాటకదా!.... కాలే కడుపులతో ఖాళీ జేబులతో వీధుల వెంట దర్జాగా తిరగడమనేది జరగని పని!" అంది.

"మన కడుపులు, జేబులు నిండాలంటే ప్రజల జేబులు ఖాళీ చేయడమొక్కటే మార్గం. దొంగతనాలు నేనొక్కడినే చేయలేను. అందుకు ఏదో ఒక దొంగల ముఠాలో చేరడమే క్షేమకరం!...." అన్నాడు క్లేపోల్.

అతడి మాటలు విన్న ఫాగిన్ తనలో నవ్వుకున్నాడు. నెమ్మదిగా వెళ్ళి వాళ్ళ ప్రక్కన కూర్చున్నాడు.

"ఇతరుల జేబులు ఖాళీ చేస్తూ హాయిగా తిని, దర్జాగా తిరగడానికి దొంగతనాన్ని మించిందిలేదు." అన్నాడు ఫాగిన్ నవ్వుతూ.

క్లేపోల్ ముఖం పాలిపోయింది భయంతో!

"ఇందులో భయపడవలసింది ఏమీలేదు మిత్రమా!.... ఈ త్రీక్రిప్పుల్స్ బ్రాందీషాపుకి వచ్చే జనమంతా ఆ వాడకకు చెందినవారే! మీకు అభ్యంతరం లేక పోతే మిమ్మల్ని ఓ దొంగల ముఠాకు పరిచయం చేస్తాను." అన్నాడు ఫాగిన్.



లండన్ బ్రిడ్జ్ వద్దకు వెళుతున్న నాన్సీని, వెళ్ళవద్దు అంటూ సైకెస్ ఆమె చేయి పుచ్చుకుని లాగుట!

"మేము దొంగల ముఠాలో చేరినట్లయితే మా డబ్బంతా దొంగల నాయకుడికి ఇచ్చేయవలసిందేనా?" అడిగాడు క్లేపోల్.

"తప్పదుకదా!" అన్నాడు ఫాగిన్!

"దొంగల ముఠాలో చేరుతాము. దొంగతనాలు చేస్తాము. ఏమీ దొరకని రోజున మాగతేమిటి? నెలజీతాలు ఉంటాయా?" అన్నాడు క్లేపోల్.

"జెంటిల్‌మేన్‌వలె జీవించవచ్చు. తినగలిగినంత తిండి తాగ గలిగినంత తాగొచ్చు. నువ్వు ఎంత సంపాదిస్తావో అందులో సగం నీకు యిస్తారు." అన్నాడు ఫాగిన్.

"బాగుంది!.... మొట్టమొదటగా చాలా తేలికగా సంపాదించే మార్గమేదైనా ఉంటే చెప్పండి!...." అన్నాడు క్లేపోల్.

"మా దొంగలముఠాలో చేరితే నువ్వు ప్రధానంగా చేయవలసింది ప్రజల మీద నిఘా ఉంచడం....ఎవరు ఎలాంటివారు, ఎవరి వద్ద ఏముంది? ఇలాంటివన్నీ తెలుసుకుని వచ్చి మాకు చెబుతూ వుండాలి."

"దానివల్ల మాకు లాభం వుండదు కదా!...."

"లాభం వచ్చే తేలిక మార్గమొకటి చెబుతాను. తల్లులు తమ పిల్లలకు డబ్బులు యిచ్చి ఏవైనా సరుకులు తీసుకు రమ్మని పంపుతూ వుంటారు. అటువంటి పిల్లల్ని చూసి, వాళ్ళ చేతుల్లోని డబ్బు లాక్కుని వాళ్ళను నేలకు పడదోసి, మన దారిన వెళ్ళిపోవడమే!"

"మీరు చెప్పిన వ్యవహారం చాలా బాగుంది. తేలికగా నిర్వహించగలిగే పని!....ఇది చేస్తాను!...." అన్నాడు క్లేపోల్.

"అయితే మీరిద్దరూ ఈ క్షణం నుంచీ మా దొంగలముఠా సభ్యులు!" అన్నాడు ఫాగిన్.

## 17

ఆదివారం సాయంత్రం ఫాగిన్, సైకెస్ నాన్సీ గదిలో కూర్చుని ఏదో దొంగతనం గురించి చాలాసేపు చర్చించుకున్నారు.

"డాడ్జర్, ఏదో వెండి ముక్కుపొడుం డబ్బా దొంగతనం చేసి పోలీసులకు దొరికిపోయాడట కదా!" అడిగాడు సైకెస్.

"ఈ రోజు అతడి కేసు విచారణ!....వివరాలు కనుక్కు రమ్మని క్లేపోల్‌ని కోర్టుకు పంపించాను" అన్నాడు ఫాగిన్.

రాత్రి పదకొండు గంటల ప్రాంతంలో, లండన్ బ్రిడ్జి మీద షికారుగా తిరిగి రావడానికి బయలుదేరింది నాన్సీ!

"ఇంత రాత్రివేళ, నాన్సీ ఎక్కడికి బయలుదేరింది?" ఫాగిన్ సైకెస్‌ని

ప్రశ్నించాడు.

"చల్లగాలి పీల్చుకోవడానికి! అలా తిరిగి వస్తే నాకు కొంత ఉల్లాసంగా వుంటుంది" అంటూ నాన్సీ జవాబు చెప్పింది.

"బ్రిడ్జిమీద షికారు అని చెప్పి నువ్వు మరొక చోటికి వెళ్ళడంలేదు కదా!" అన్నాడు సైకెస్.

నాన్సీ అతడివేపు తీక్షణంగా చూసింది.

"నీకు నా మీద అనుమానం!.... మగబుద్ధి చూపించావు" అంది నాన్సీ కోపంగా.

సైకెస్ విసురుగా లేచి ఆమె చెయ్యి పుచ్చుకుని బలంగా వెనక్కి లాగాడు. ఆ వేగానికి నాన్సీ వచ్చి ఓ కుర్చీ మీద పడిపోయింది.

"అక్కడే కదలకుండా కూర్చో! కదిలావంటే చంపేస్తాను" అన్నాడు సైకెస్ ఆమెతో.

నాన్సీ ఎంతోసేపు అక్కడ కూర్చోలేకపోయింది. అర్ధరాత్రి గడిచిన తర్వాత ఆమె విసురుగా లేచి బయటికి వెళ్ళిపోయింది.

"నేను భయపెట్టినా కూడా లెక్కచేయకుండా ఎలా వెళ్ళిపోయిందో చూడు!....ఆమె బయటికి వెళ్ళేందుకు అంత ఆతృత పడుతున్నదీ అంటే అందుకు ఏదో కారణం ఉండి వుండాలి. అదేమిటో ఊహించగలవా మిస్టర్ ఫాగిన్?" అడిగాడు సైకెస్.

ఇంటికి బయలుదేరిన ఫాగిన్ దారిపొడుగునా నాన్సీ గురించే ఆలోచించసాగేడు. ఆమె చిరాకు, కోపోద్రేకమూ, విశేషించి, దొంగలముఠా కార్యకలాపాలలో ఆమెకు ఉత్సాహం లేకపోవడం.... ఇవన్నీ ఫాగిన్‌కి ఆశ్చర్యాన్ని కలిగించాయి. వీటన్నిటినీ మించి ఆమెకు సైకెస్ అంటే చిరాకు పడటం, అతడ్ని ద్వేషించడం. ఫాగిన్‌కి మరింత ఆశ్చర్యాన్ని కలిగించాయి. వీటన్నిటికీ కారణం బహుశా నాన్సీకి మరొక ప్రియుడు లభించడమే కావచ్చు. అదే నిజమైతే ఆ ప్రియుడు ఎవరో తెలుసుకోవాలి. అమె మీద నిఘావేసి వుంచి అతడెవరో తెలుసుకోవాలంటే అందుకు క్లెపోల్ ఒక్కడే సమర్థుడు!' అనుకున్నాడు ఫాగిన్.

## 18

ఫాగిన్, నోక్లెపోల్‌ని కలుసుకుని "ఒక ముఖ్యమైన విషయం తెలుసుకునేందుకు నీ అవసరం పడింది" అన్నాడు.

"అదేమంత ప్రమాదకరమైన విషయం కాదుగదా!" అన్నాడు క్లేపోల్.

"అటువంటిదేమీ కాదు. నువ్వు చేయవలసిందల్లా ఓ అందమైన యువతిని వెంటాడటమే! ఆమె ఎవరిని కలుసుకుంటున్నదీ, అతనితో ఏం మాట్లాడుతున్నదీ...."

"అటువంటి సమాచారం సేకరిస్తే నాకు ముట్టజెప్పే సొమ్ము విలువ ఎంత ఉంటుంది?" అడిగాడు క్లేపోల్.

"నేను అప్పగించిన యీ పనిని సంతృప్తికరంగా నిర్వహిస్తే నీకొక పౌండు యిస్తాను. ఇటువంటి తేలిక పనికి అది చాలా ఎక్కువనే భావిస్తాను" అన్నాడు ఫాగిన్.

"సరే! ఎవరా యువతి?"

"మనలో ఒకతె!"

నాన్సీ పేరు చెప్పాడు ఫాగిన్!.... వారం రోజులపాటు క్లేపోల్ నాన్సీని నీడలా వెంటాడాడు. అయినా లాభంలేక పోయింది. ఆ వారం రోజులలోనూ నాన్సీ ఎవరినీ కలుసుకోలేదు.

ఆదివారం రాత్రి నాన్సీ 'త్రీక్రిప్పుల్స్' బ్రాందీ షాపునుండి, లండన్ బ్రిడ్జి వేపు బయలుదేరింది. ఆమె వెనుకగా క్లేపోల్ బయలుదేరాడు.

అర్ధరాత్రి సమయంలో చర్చి గంటలు మ్రోగాయి. ఓ అందమైన యువతి, ఓ మధ్యవయస్కుడైన పెద్దమనిషి, బ్రిడ్జికి కొద్ది దూరంలో ఆగి వున్న గుర్రపు బగ్గీ నుండి క్రిందికి దిగి నాన్సీకి ఎదురుగా బయలుదేరారు.

నాన్సీ వాళ్ళను చూసింది. భయంతో తల తిప్పి ఒకసారి పరిసరాలను గమనించింది. వాళ్ళిద్దరూ ఆమె సమీపానికి వచ్చేసారు.

"ఇక్కడ కాదు. నా వెంట రండి!" వాళ్ళకు వినిపించేలా గొణిగింది నాన్సీ.

ఆ తర్వాత ఆమె ఎటూ దిక్కులు చూడకుండా బ్రిడ్జి మెట్లు ఎక్కింది. వాళ్ళిద్దరూ మాట్లాడకుండా ఆమె వెనుకగా బయలుదేరారు.

నాన్సీ బ్రిడ్జి మీద కొంతసేపు నడిచి, అవతలివేపున ఉన్న బ్రిడ్జి మెట్లు దిగి క్రిందికి వచ్చింది.

"పోయిన ఆదివారం మేము ఇక్కడికి వచ్చాము. కానీ నువ్వు రాలేదు. ఏమిటి కారణం?" అని నాన్సీని అడిగాడు మిస్టర్ బ్రౌన్‌లో.

"నేను రాలేకపోయాను. బిల్ సైకెస్ నన్ను ఎక్కడికీ వెళ్ళవద్దని నిర్బంధించాడు. అప్పుడు హోటల్ కి వెళ్ళి మిస్ రోసీని కలుసుకోగలిగానంటే సైకెస్ పానీయంలో నిద్రమాత్రలు కలపడం వల్లనే!" అంది నాన్సీ.

"చూడు నాన్సీ! రోసీ నీ రహస్య సమాచారం యావత్తూ నాతో చెప్పింది.



ఫాగిన్ నాన్సీ మీద గూఢచారిగా నియమించిన క్లైపోల్, రహస్యంగా వాళ్ళని, నాన్సీని, బ్రౌన్‌లోని, రోసీని చూచుట!

నేను నిన్ను నమ్ముతున్నాను. అలాగే నువ్వు కూడా నన్ను విశ్వసించాలి. మంక్స్‌ని ఎలాగైనా పట్టుకుని, అతని ద్వారా, అతడికి ఏమి తెలుసునో తెలుసుకోవడమే, మా ముఖ్యోద్దేశం!—ఒకవేళ మంక్స్ మాకు దొరకనట్లయితే, దొరికినా అసలు విషయం చెప్పడానికి నిరాకరిస్తే, నువ్వు మాకొక సహాయం చేసిపెట్టాలి" అన్నాడు మిస్టర్

బ్రౌన్‌లో.

"ఏమిటది?"

"ఫాగిన్‌ని మాకు అప్పగించాలి" అన్నాడు బ్రౌన్‌లో.

"ఫాగిన్‌ని అప్పగించాలా?....అది నా వల్ల కాదు. నేను ఎన్నటికీ అలా చేయలేను. ఎందుకంటే అతడు నాకు వ్యతిరేకంగా ఏనాడూ పల్లెత్తుమాట అనలేదు. అతడు నన్ను విశ్వసించాడు. నేను నమ్మకద్రోహం చేయలేను" అంది నాన్సీ.

బ్రౌన్‌లో ఆలోచిస్తూ "ఆ పరిస్థితుల్లో ఏ విధంగానైనా సరే మంక్స్‌ని మాకు అప్పగించు. అతడితోనే వ్యవహారం కొనసాగిస్తాము. ఆలివర్ గురించిన వివరాలు తెలుసుకోవడమే మా లక్ష్యం. మంక్స్ మాకు ఎక్కడ దొరుకుతాడో ఆ విషయం చెబితే చాలు" అన్నాడు.

నాన్సీ యిలా చెప్పింది : "మంక్స్ పొడవుగా ఉంటాడు. బలమైన మనిషి. అతడికి ఇంచుమించు ఇరవై ఎనిమిది సంవత్సరాలు ఉంటాయి. అతడి ముఖం అనవసరంగా ముడతలుపడి ఉంటుంది. ఎప్పుడూ పెదాలు కొరుక్కుంటూ ఉండడంవల్ల వాటిమీద ఎరుపు నీలిరంగు గాట్లు ఉంటాయి. పొడవాటి గౌనులాంటిది ధరిస్తాడు. వెడల్పాటి ఎర్రటిగుర్తు ఒకటి కంఠంమీద ఉంటుంది."

మిస్టర్ బ్రౌన్‌లో, మిస్ రోసీ ఒక్కసారే ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. ఆ తర్వాత భారంగా నిట్టూర్చారు.

నాన్సీ వాళ్ళవంక చూస్తూ "మంక్స్ మీకు తెలుసా ఏమిటి?" అని అడిగింది.

"తెలుసు!....సరే మిగతా వివరాలు చెప్పు?" అన్నాడు బ్రౌన్‌లో.

"అతడు రోజులో చాలా భాగం త్రీ క్రిప్పుల్స్ బ్రాందీషాపులోనే కాలక్షేపం చేస్తూ ఉంటాడు. మంక్స్ అక్కడ మీకు ఒంటరిగా దొరుకుతాడు" అంది నాన్సీ.

అప్పుడు బ్రౌన్‌లో యిలా అన్నాడు : "మాకు చాలా విలువైన సమాచారం అందించావు. ఇప్పుడు మేము నీకు ఎటువంటి సహాయం చేయగలమో చెప్పు. నువ్వు కోరింది చేయడానికి సిద్ధంగా ఉన్నాము."

నాన్సీ నవ్వి "మీ మంచితనానికి నా కృతజ్ఞతలు. నేను నా పాత జీవితంతో బంధింపబడి ఉన్నాను. అయినా ఆ జీవితాన్ని నేను అసహ్యించుకుంటున్నాను. అయినా దానిని వదిలిరాలేను. గుడ్‌నైట్" అంది.

ముగ్గురూ కలిసి బ్రిడ్జిపైనుండి యివతలివేపుకు వచ్చారు. మిస్ రోసీ, మిస్టర్ బ్రౌన్‌లో బండిని అధిరోహించారు. బండి ముందుకు కదిలి వెళ్ళింది. నాన్సీ తన స్థావరం వేపు బయలుదేరింది.

కొద్దినిముషాల తర్వాత క్లైపోల్ తను రహస్యంగా దాక్కున్న చోటు నుండి యివతలికి వచ్చాడు. ఆ తర్వాత వీధులలో వేగంగా నడుస్తూ ఫాగిన్ ఇంటి దిక్కుగా బయలుదేరాడు.

తను విన్నది చూసింది ఫాగిన్‌తో చెప్పి అతడు యిచ్చే డబ్బు తీసుకుని జల్సాగా ఖర్చు చేయవచ్చునన్నది క్లైపోల్ కోరిక!....

## 19

తక్షణం రావలసిందిగా ఫాగిన్, సైకెస్‌కి కబురుపెట్టాడు. అతడు రాగానే నాన్సీ లండన్ బ్రిడ్జివద్ద వాళ్ళను కలుసుకున్న విషయమూ ఆమె వాళ్ళకు ఏం చెప్పిందీ ఫాగిన్, సైకెస్‌తో వివరంగా చెప్పాడు. అందుకు సాక్ష్యంగా క్లైపోల్‌ని చూపించాడు.

సైకెస్‌కి నాన్సీమీద విపరీతమైన కోపం వచ్చింది. వేగంగా ఇంటి కొచ్చాడు.

ఆ సమయంలో నాన్సీ నిద్రపోతున్నది. సైకెస్ ఆమె కంఠాన్ని రెండు చేతులతో బలంగా పుచ్చుకుని మంచంమీదినుండి నేలమీదికి యీడ్చుకుంటూ వచ్చాడు.

"ఏం జరిగింది మిస్టర్ బిల్?....నన్నెందుకిలా చేస్తున్నావు? ఏం చేసాను నేను?" బాధతో ఎగరొప్పుతో అడిగింది నాన్సీ. ఆమెకు ఊపిరి ఆడటం కష్టం కాసాగింది.

"వంచకి! ఏమీ తెలియదా నీకు? నువ్వు వాళ్ళతో చెప్పిన ప్రతివాక్యం నాకు తెలిసింది." అన్నాడు సైకెస్ నాన్సీని విడిచి పెట్టకుండా.

"అయితే నా ప్రాణాలు రక్షించు. నీ ప్రాణాలు ఫాగిన్ ప్రాణాలు నేను రక్షిస్తాను." అంది నాన్సీ బాధగా అరుస్తూ.

ఆమె తన రెండు చేతులతోనూ సైకెస్ రెండు కాళ్ళూ బలంగా పుచ్చుకుంది. ప్రాణ భయంతో అతడి కాళ్ళకు అంటుకు పోయింది. అయినా సైకెస్ ఆమెను విడిచిపెట్టలేదు.

"సైకెస్! నా మాట విను. నన్ను చంపకు! మనం లండన్ విడిచి ఎక్కడి

కైనా దూరంగా వెళ్ళిపోదాం. కొత్త జీవితం ప్రారంభిద్దాం! నువ్వంటే నాకు ప్రాణం. నేను నీకు ఎంతో సహాయం చేసాను. ఎంతో సేవ చేసాను. అటువంటి నన్ను చంపుతావా?" అంది నాన్సీ అతడి చేతిలో గిలగిల కొట్టు కుంటూ.

సైకెస్ రెండు చేతులూ రెండు కాళ్ళూ నాన్సీ తన దేహంతో చేతులతో



తమ రహస్యాలు రోసీ, బ్రౌన్‌లోకి చెప్పిందన్న విషయం తెలిసిన సైకెస్ ఆమెను పిస్టల్‌తో కాల్చుట !

బిగించి పట్టుకుని తనకు ప్రాణభిక్ష పెట్టమని అర్థించసాగింది. సైకెస్‌కి ఆమె పట్టు నుండి విడిపించుకోవడం కష్టమైపోయింది. అతడు చివరకు ఎలాగో ఆమె నుండి ఒక చేతిని విడిపించుకో గలిగాడు. ఆ చేయి నడుముకున్న బెల్టులో నుండి పిస్టల్‌ని

బైటికి తీసింది.

పిస్టల్‌తో ఆమెను కాల్చడం ఏమంత కష్టంకాదు. కానీ పిస్టల్ కాల్చిన శబ్దం బయటికి వినిపిస్తుంది. భయభ్రాంతులైన ఇరుగు పొరుగు ప్రజలు లోనికి వస్తారు. నాన్సీని హత్య చేసిన నేరానికి తను పోలీసులకు దొరికిపోతాడు. అప్పుడు తనకు ఉరిశిక్ష తప్పదు. అనుకున్నాడు సైకెస్.

నాన్సీని చంపడం అతడికి బాధగానే వుంది. కానీ ఆమె మనసుమారింది. తనకు చెప్పకుండానే ఎవరెవరినో కలుసుకుంటున్నది. ఇతరులకు రహస్యాలను అందిస్తున్నది. అనే కోపం సైకెస్‌ని పిచ్చివాడిని చేసింది. తనుకాకపోయినా ఫాగిన్ అయినా ఆమెను చంపుతాడు. ఆ కార్యంతనే పూర్తిచేసి ఫాగిన్ విశ్వాసాన్ని పొందడం తనకు క్షేమకరం అనుకున్నాడు సైకెస్.

వెంటనే అతడు పిస్టల్ వున్న కుడిచేతిని పైకెత్తాడు. నాన్సీ ప్రాణ భిక్షపెట్టమంటూ అతడి కాళ్ళముందు కూలబడి పోయింది. సైకెస్ పిస్టల్‌ను ఆమె తలకు ఆనించి ట్రిగ్గర్ నొక్కాడు.

అంతే!....నాన్సీ తలపగిలిపోయింది. ఆమె అచేతనంగా వెనక్కి విరుచుకు పడిపోయింది. తక్షణం ఆమె ఊపిరి ఆగిపోయింది. సైకెస్ గట్టిగా కళ్ళు మూసుకున్నాడు .... తర్వాత నాన్సీ శవం ప్రక్కన కూర్చుని గంటల తరబడి ఆమెనే చూస్తూ ఉండిపోయాడు.

తెల్లవారింది. సూర్య కిరణాలు గదిలో ప్రసరించాయి. సైకెస్ నెమ్మదిగా లేచాడు. బట్టలమీదున్న రక్తపు మరకలను శుభ్రంగా కడుక్కున్నాడు. ఇక ఒక్క క్షణం కూడా ఆ ఇంటిలో వుండటం సైకెస్‌కి కష్టమై పోయింది. అతడు తన కుక్కను వెంట బెట్టుకుని వీధిలోకి వచ్చాడు. కాలినడకన బయలుదేరి లండన్ వెలుపలికి చేరుకున్నాడు. తొమ్మిది గంటల ప్రాంతానికి అతడొక చిన్నపట్టణం సమీపించాడు.

అక్కడున్న పోస్టాఫీసు దగ్గర జనం గుమిగూడి వున్నారు. రాత్రి లండన్ నగరంలో జరిగిన హత్య గురించే వాళ్ళు మాట్లాడుకుంటున్నారు. వాళ్ళమాటలు విన్నాడు సైకెస్. తిరిగి లండన్ నగరం వెళ్ళిపోదామని నిశ్చయించుకున్నాడు ఆ మహానగరంలోని జనంలో కలిసిపోతే తనని ఎవరూ గుర్తుపట్టలేరని సైకెస్ ఆలోచించాడు. దానికంటే ఫ్రాన్స్ పారిపోతే అంతకంటే సురక్షిత ప్రదేశం మరొకటి ఉండదని కూడా అనుకున్నాడు సైకెస్.

'మొట్టమొదటగా యీ పెంపుడు కుక్కకు ఉద్వాసన చెప్పాలి. దీనితో తను ఎక్కడికి వెళ్ళాలన్నా ఆటంకమే!.... ఇది కూడా ప్రాణాలతో బ్రతికి ఉండటం ప్రమాదమే!.... కాలువ నీటిలో దీనిని ముంచి చంపేయడమే మంచిది.' అనుకున్నాడు సైకెస్.



బ్రౌన్‌లో మనుషులు మంక్స్‌ని పట్టుకుని హోటల్ గదిలోకి బ్రౌన్‌లో వద్దకు తీసుకు వచ్చుట!

అయితే తెలివిగల ఆ జంతువు తన యజమాని తన విషయంలో ఏం చేయబోతున్నాడో ముందే పసిగట్టింది. తక్షణం అది సైకెస్ చేతులనుండి విడిపించుకుని ముందుకు దూకింది. ఆ తర్వాత విశ్వాసం గల ఆ కుక్క పిక్కబలం చూపించి పొలాలకు అడ్డుగా పరిగెత్తుకుంటూ ఎటో వెళ్ళిపోయింది.

తోడునీడగా ఉన్న నాన్సీని చంపేసాడు. తనకు రక్షణగా విశ్వాసంతో కనిపెట్టుకుని ఉన్న కుక్క తనని విడిచిపెట్టిపోయింది. తన స్నేహితులకు కనిపిస్తే హంతకుడని, వాళ్ళే తనని పోలీసులకు పట్టి ఇస్తారు.

సైకస్ ఒంటరిగా, ముందుకు బయలుదేరాడు. ఎటు వెళ్ళాలో, గమ్యం ఎక్కడో తెలియని సైకెస్ ప్రయాణం ఎక్కడికో ఎవరికి తెలుసు?——

## 20

బలమైన మనుషులు గుర్రపు బగ్గీలో నుంచి మంక్స్‌ని యివతలికి లాగి ఎదురుగా ఉన్న ఇంటిలోనికి తీసుకు వచ్చారు. అక్కడ గదిలో మిస్టర్ బ్రౌన్‌లో కూర్చుని ఉన్నాడు.

మంక్స్ బ్రౌన్‌లోను చూస్తూనే ఆగ్రహంతో "వీధిలో వస్తున్న నన్ను అపహరించుకు రావడానికి ఎంత ధైర్యం మీకు?" అన్నాడు.

బ్రౌన్‌లో నవ్వుతూ "నిన్ను ఇక్కడికి తీసుకు రావడానికి మాకు చాలా కారణాలు ఉన్నాయి. నువ్వు ఇక్కడికి రావడం క్షేమకరమో లేక పోలీసులకు చిక్కి జైలు ఊచలు లెక్కపెట్టడం ఉచితమో, నువ్వే ఆలోచించుకో!.... ఆ నిర్ణయాన్ని నీకే వదిలిపెడుతున్నాము. మేము అడిగిన ప్రశ్నలకు సరియైన సమాధానాలు చెప్పావనుకో బ్రతికి బైట పడతావు. ఏదైనా మోసం చేయాలని చూసావనుకో నిన్ను అరెస్ట్ చేయించడం తప్పదు. అప్పుడు చాలా ఇబ్బందులు పడతావు. ఆలోచించుకో" అన్నాడు.

"మీరు మా నాన్నగారి స్నేహితులై ఉండి కూడా నన్ను ఇలా వేధించడం ఏం సబబో నాకు తెలియడంలేదు." అన్నాడు మంక్స్.

బ్రౌన్‌లో యిలా అన్నాడు! నేను మీ నాన్నగారి పాత స్నేహితుణ్ణి కాబట్టే ఆ స్నేహాన్ని పురస్కరించుకుని నిన్ను కఠినంగా శిక్షించలేదు. ఎడ్వర్డ్‌లీఫోర్డ్ అనే పేరుతో పిలిపించుకోడానికి నీకు చాలా చిన్నతనంగా ఉందికదూ! నీ తండ్రి చెల్లెలు బ్రతికి ఉంటే అనగా నీ మేనత్త నాకు భార్య అయి ఉండేది."

"అయితే మీకు నానుంచి ఏం కావాలి?" అడిగాడు మంక్స్.

"నీకొక తమ్ముడున్నాడు. ఆ తమ్ముడి పేరేమిటో ఇంతకు క్రితం వీధిలో నీతో చెప్పాను. గుర్తుందా?" అన్నాడు బ్రౌన్‌లో.

"నాకు తమ్ముడు అంటూ ఎవరూలేరు. నా తండ్రికి నేను ఒక్కడినే కొడుకును!.... మా నాన్నగారి పాతస్నేహితులుగా మీకా విషయం బాగా తెలుసు!

బ్రౌన్‌లో నవ్వి "నాకు అంతా తెలుసు!.... మీ నాన్న మంచి వయసులో ఉన్నప్పుడు, అతని తల్లిదండ్రుల మనసు కష్టపెట్టలేక వాళ్ళు బలవంతం చేసిన అమ్మాయినే వివాహం చేసుకున్నాడు. ఆ వివాహం అతడికి యిష్టంలేదు. అతడు వివాహం చేసుకున్న అమ్మాయి మీ నాన్నకంటే వయసులో చాలా పెద్దది. ఆ తర్వాత నీ తల్లిదండ్రులు విడిపోయారు! దాదాపు పదిహేను సంవత్సరాల క్రితం మీ నాన్నకు ఒక వ్యక్తితో స్నేహం కుదిరింది. ఆ స్నేహితుడికి ఇద్దరు కుమార్తె లున్నారు. భార్య చనిపోయింది. పెద్దమ్మాయికి వయస్సు పందొమ్మిది సంవత్సరాలు. చిన్న అమ్మాయి వయసు కేవలం మూడు సంవత్సరాలే!....మీ నాన్న పెద్దమ్మాయిని ప్రేమించాడు. ఆమె కూడా మీ నాన్నను గాఢంగా ప్రేమించింది. అదే సమయంలో మీ నాన్న సమీప బంధువు ఒకాయన మరణించాడు. అతడు చాలా ధనాన్నీ, ఆస్థినీ వదిలి వెళ్ళిపోయాడు. అదంతా మీ నాన్నకు సంక్రమించింది. అప్పుడు నీ తల్లి పారిస్‌లో విచ్చలవిడిగా తిరుగుతూ విలాస జీవితం గడుపుతూ వుండేది. మీ నాన్నకు అంతులేని సంపద వచ్చిందన్న విషయం ఆమెకు తెలిసింది. వెంటనే ఆమె నిన్ను తీసుకుని మీ నాన్న వద్దకు రోమ్ వచ్చింది. మీరు రోమ్ వచ్చిన ఒక్కరోజు తర్వాత, అకస్మాత్తుగా మీ నాన్న మృత్యువాత బడ్డాడు. మీ నాన్న ఎటువంటి వీలునామా రాయలేదు....వింటున్నావా? మీ నాన్న ఎటువంటి వీలునామా కూడా రాయలేదు. అందుచేత మీ నాన్నకు సంబంధించిన డబ్బు, ఆస్థిపాస్తులన్నీ నీ తల్లికే చెందుతాయి. నీ తల్లికి ఎందుకు చెందుతాయో తెలుసా?....నీ తల్లి ద్వారా నువ్వు మీ నాన్నకు జన్మించావు కాబట్టి!" అంటూ తన వాగ్ధాటిని ఆపి ఊపిరి పీల్చుకున్నాడు.

కుర్చీలో కూర్చుని బ్రౌన్‌లో చెబుతున్న మాటలను ఆలకిస్తున్న మంక్స్ తేలికగా నిట్టూర్చి కుర్చీలో వెనక్కి జారగిలబడ్డాడు.

"మీ నాన్న రోమ్‌కి వెళ్ళేముందు, ఒకరోజు నా వద్దకు వచ్చాడు." తిరిగి తన వాదన ప్రారంభిస్తూ బ్రౌన్‌లో అన్నాడు : "మీ నాన్న రోమ్ వెళుతూ నాకొక అందమైన అమ్మాయి చిత్రపటాన్ని యిచ్చాడు. దానిని స్వయంగా మీ నాన్నే చిత్రీకరించాడు. ఆ చిత్రపటం యిప్పటికీ నా వద్ద వున్నది. అప్పుడు మీ నాన్న నాతో 'తన పేరున వున్న ఆస్థి యావత్తూ అమ్మేసి నా భార్యకూ, నా కొడుక్కీ సమంగా పంచి యివ్వండి! నేను ప్రేమించిన అమ్మాయితో, ఎక్కడో ఒకచోట ఆనందంగా జీవిస్తాను' అని చెప్పాడు. నా వద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత మీ నాన్న ఎక్కడున్నదీ, ఏమైందీ ఆ వివరాలేమీ నాకు తెలియలేదు. మీ నాన్న చనిపోయిన విషయం తెలిసిన తర్వాత, అతడు ప్రేమించిన అందమైన యువతి కోసం వాకబు చేసాను. దురదృష్టవశాత్తూ ఆ కుటుంబం వారం రోజుల క్రితమే లండన్ విడిచి ఎక్కడికో వెళ్ళిపోయారని తెలిసింది."



ఆలివర్ విషయంలో మంక్స్ చేసిన ద్రోహకార్యాలనూ, రహస్యాలనూ బ్రౌన్‌లో, మంక్స్‌తో ముచ్చటించుట!

అది విన్న మంక్స్ హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు! —

"అనాథ శరణాలయంలో, గర్భవతి అయిన ఓ యువతి ఒక మగ శిశువును ప్రసవించి చనిపోయింది. ఆ పిల్లవాడు చాలా బలహీనంగా పుట్టాడు. పెరిగి పెద్దవా

దయ్యాడు. దైవవశాత్తూ ఆ కుర్రవాడు నా పాల బడ్డాడు. ఆ పిల్లవాడిని నేను చెడ్డ శక్తుల చేతుల్లో పడకుండా కాపాడేను" అన్నాడు బ్రౌన్‌లో.

"ఏమిటీ?" మంక్స్ నివ్వెరపాటుతో అన్నాడు.

"మీ నాన్న రోమ్ వెళుతూ నా కిచ్చిన చిత్రపటంలోని అందమైన అమ్మాయి ముఖంతో ఆ కుర్రవాడి ముఖాన్ని జతచేసి చూసాను. ఎటువంటి తేడా కనిపించలేదు నాకు. రెండు ముఖాలూ అచ్చు గుద్దినట్టు ఒకే మాదిరిగా ఉన్నాయి. నేను ఆ కుర్రవాడి చరిత్ర ఏమిటో తెలుసుకునే ప్రయత్నంలో ఉండగానే, నీ దొంగల ముఠా సభ్యులు ఆ కుర్రవాడిని అపహరించి తీసుకుపోయారు" అన్నాడు బ్రౌన్‌లో.

"కానీ....మీరు....మీరు ఆ కుర్రవాడు నా తండ్రికీ, ఆ అందమైన యువతికీ పుట్టినవాడనీ ఋజువుచేయలేరు" అన్నాడు మంక్స్ బెరుకుగా.

బ్రౌన్‌లో నవ్వి "ఆ కుర్రవాడు వాళ్ళిద్దరికీ పుట్టినవాడేనన్న సాక్ష్యాధారాలు నావద్ద ఉన్నాయి" అన్నాడు.

తర్వాత బ్రౌన్‌లో యింకా యిలా అన్నాడు :

"మీ నాన్న లోగడ ఓ వీలునామా రాసాడు. దానిని నీ తల్లి నాశనం చేసింది. ఆ రహస్యాన్ని నీ తల్లి నీకు తప్పకుండా చెప్పే వుంటుంది. ఆ వీలునామాలో తనకూ ఆ అందమైన యువతికీ సంతానం కలుగుతుందని, ఆమె గర్భవతి అనీ మీ నాన్న తెలియజేశాడు. నువ్వు ఆ పిల్లవాడిని గుర్తు పట్టావు. ఆ సాక్ష్యాన్ని నాశనం చేయాలని పూనుకొన్నావు. అందుకోసం యితరులకి డబ్బు యిచ్చి కూడా ప్రయత్నించావు....నువ్వు నిజంగా ఆ తండ్రికి తగిన కొడుకువుకావు. నువ్వు దొంగలకి, హంతకులకి స్నేహితుడవు. నీలో మంచి బుద్ధి మచ్చుకయినా కనిపించదు. నీ కారణంగా ఒక హత్య జరిగింది. ఆ విషయం తెలుసా నీకు?" అన్నాడు బ్రౌన్‌లో.

"లేదు, లేదు!....నాకేం తెలియదు. ఆ హత్యకూ నాకూ ఎటువంటి సంబంధమూ లేదు" అంటూ మంక్స్ పెద్దగా అరిచాడు.

"నీ రహస్యాలు తెలుసుకొన్నందువల్లనే ఆ అమ్మాయి హత్య చేయబడింది...."

"అవన్నీ ఎందుకు? ఇప్పుడు నేనేం చేయాలి?"

బ్రౌన్‌లో ఓ కాగితాన్ని మంక్స్ ముందు పెడుతూ "ఈ స్టేట్‌మెంట్‌లో

నిజమేమిటో ఆ విషయాలన్నీ లిఖింపబడి వున్నాయి. నువ్వు యీ కాగితంమీద సంతకం చెయ్! రేపు కోర్టులోకూడా యీ స్టేట్ మెంట్ లో ఏమి వున్నదో అదే చెప్పాలి జడ్జిముందు!-"

మంక్స్ చాలాసేపు ఆలోచించి "మీరు చెప్పినట్లే చేస్తాను" అన్నాడు.



పోలీసులనుండి తప్పించుకున్న ఇద్దరు దొంగలముఠా సభ్యులు మాట్లాడుకుంటుండగా నాన్సీని హత్యచేసిన సైకెస్ పోలీసులనుండి తప్పించుకుని వచ్చుట !

"అంతేకాదు; పేదవాడైన నీ తమ్ముడు ఆలివర్ కి న్యాయంగా ఎంత ఆస్థి రావాలో అంతవాటా అతడికి ఇవ్వాలి. ఆ కుఱ్ఱవాడు హాయిగా సుఖంగా ఉండటమే

నేను కోరుకునేది" అన్నాడు బ్రౌన్‌లో.

మంక్స్ తలపైకెత్తి ఆ గది నలువేపులా ఒకసారి పరికించి చూసాడు. తప్పించుకు పారిపోవడానికి అవకాశం దొరుకుతుందేమోనని ఆలోచిస్తూ ఉండి పోయాడు.

అదే సమయంలో డాక్టర్ లాస్ బెర్నీ గదిలోకి వేగంగా వచ్చాడు.

"నాన్సీని హత్యచేసిన హంతకుడు యీ రాత్రికి తప్పకుండా దొరికి పోతాడు. పోలీసు అధికారులు, గూఢచారులు నగరమంతా వాడికోసం గాలిస్తున్నారు. వంద పౌండ్ల బహుమానంకూడా ప్రభుత్వం ప్రకటించింది. మిస్టర్ హారీ, ఫాగిన్‌ని పట్టి యివ్వడానికి పోలీసులకి సహకరిస్తున్నాడు" అని చెప్పాడు డాక్టర్ లాస్ బెర్నీ.

బ్రౌన్‌లో మంక్స్ దిక్కు తిరిగి "నువ్వు మానుంచి తప్పించుకు పోయేందుకు దారులు వెదుకుతున్నావని నాకు తెలుసు. కానీ డాక్టర్ లాస్ బెర్నీ చెప్పిన విషయాలు విన్నావుకదా!....ఇప్పుడు పారిపోవడానికి ప్రయత్నించవనీ, మాతో సహకరించడమే క్షేమకరమని నువ్వు గ్రహించి ఉంటావనుకుంటాను" అన్నాడు.

తర్వాత అందరూ బయటికివచ్చి బైటనుండి గదికి తాళంవేసి హడావిడిగా ఎక్కడికో వెళ్ళిపోయారు.

## 21

థేమ్స్ నదికి ఆనుకునివున్న పాడుపడిన ఇంటిలో టాబీక్రాకిట్, ఛార్లీ బేట్స్ కూర్చుని ఏదో విషయం గురించి చర్చించుకోసాగేరు.

"ఫాగిన్‌ని పోలీసులు ఎప్పుడు పట్టుకున్నారు?" అడిగాడు టాబీ.

"ఈరోజు మధ్యాహ్నమే! నేను ప్రమాదాన్ని ముందే పసిగట్టి ఇంటి పొగ చిమ్నీ గుండా పైకి వెళ్ళి అక్కడనుండి గోడదూకి తప్పించుకున్నాను. క్లేపోల్ నీళ్ళులేని ఖాళీ పీపాలోకి తలక్రిందులుగా దూకాడు. వాడి కాళ్ళుపైకి కనబడుతుండడంవల్ల పోలీసులకు దొరికిపోయాడు. మన దొంగల ముఠాలోని వారు చాలామంది పోలీసులకు దొరికిపోయారు." అన్నాడు ఛార్లీబేట్స్.

అదే సమయంలో వేగంగా అడుగులు వేసుకుంటూ పరిగెత్తుకు వస్తున్న శబ్దం వారికి వినిపించింది. వాళ్ళిద్దరూ భయపడుతూ అడుగుల సవ్వడి వినవచ్చిన దిక్కుకు చూసారు.

సైకెస్ బారి నుండి తప్పించుకుపోయిన అతడి కుక్క గదిలో అడుగు పెట్టింది. అది కుంటుతున్నది. బాగా ఆకలితో ఉన్నదేమో నీరసించిపోయి ఉంది.

"ఈ కుక్క ఇక్కడికి వచ్చిందేమిటి? అంటే దీని అర్థం.... బిల్ సైకెస్ ఇక్కడికి...." టాబీ భయంతో అరిచాడు.

"ఛ! అదేంలేదు. సైకెస్ ఇక్కడికి ఎలా వస్తాడు? ప్రస్తుతం అతడు లండన్ నగరాన్ని విడిచిపెట్టి దూరంగా ఎక్కడికో వెళ్ళిపోయి ఉంటాడు. హత్య చేసి పోలీసుల నుండి తప్పించుకుంటూ లండన్ నగరంలో జీవించడమే!" అన్నాడు ఛార్లీ బేట్స్.

కొన్నిక్షణాలు గడిచిన తర్వాత ఆ ఇంటి తలుపులను ఎవరో బలంగా తన్నిన శబ్దం వినిపించింది. మరుక్షణం తలుపులు భళ్ళున తెరుచుకున్నాయి. దాని వెంబడే బిల్ సైకెస్ గదిలో అడుగుపెట్టాడు.

సైకెస్ బాగా చిక్కి ఉన్నాడు. అతడి ముఖం తెల్లగా పాలిపోయి ఉంది. కళ్ళు లోతుకుపోయి ఉన్నాయి. టాబీ, ఛార్లీ అతడ్ని చూస్తూనే బరువుగా ఊపిరి పీల్చుకున్నారు.

"నరరూప రాక్షసుడా!.... స్త్రీ హంతకుడా!" అన్నారు ఇద్దరూ సైకెస్‌ని తిడుతూ.

నేరాలు చేసేటప్పుడు వారంతా స్నేహితులు. కానీ ఇప్పుడు సైకెస్ వారి కంటికి నరరూప రాక్షసుడిగా కనిపించాడు.

అంతలో వారికి దూరంగా మనుషులు అరుస్తూ వస్తున్న శబ్దాలూ, గుర్రపు డెక్కల చప్పుళ్ళూ వినిపించాయి. వాళ్ళు భయంతో కొయ్యబారిపోయారు.

“నాకొక పొడవాటి తాడు యివ్వండి. నేను ఇంటి పైకప్పుకు వెళ్ళి, తాడు సహాయంతో ఆత్మహత్య చేసుకుంటాను. ఏమిటలా వెర్రి చూపులు?.... త్వరగా తాడు తెచ్చియివ్వండి. లేదా మిమ్మల్ని ఇద్దర్నీ చంపిపారేస్తాను.” అంటూ హూంకరించాడు సైకెస్.



పోలీసులకు చిక్కి చిత్ర హింసలు భరించేకన్నా ఆత్మహత్య నయమని భావించిన సైకెస్ ఆత్మహత్య చేసుకొనుట.

టాబీ పెద్దతాడు ఒకటి తెచ్చి సైకెస్‌కి యిచ్చాడు. అతడు ఆ తాడు తీసుకుని చకచకా ఇంటిపై భాగానికి చేరుకున్నాడు. ఆ తాడు ఒక కొసను అక్కడున్న

దూలానికి బలంగా కట్టాడు. రెండవ కొసను ఉరితాడుకు ఉండే విధంగా తయారు చేసాడు. తర్వాత సైకెస్ తన తలను వలయంలోకి దూర్చి క్రిందికి దూకేసాడు. అంతే! అతడు ఉరితాడుకు వ్రేళ్ళాడబడుతూ ఒక్క నిముషం కాళ్ళూ చేతులూ బాధతో ఆడించాడు. ఆ తర్వాత సైకెస్ ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసి పోయాయి.

## 22

ఆలివర్ మొట్టమొదట పుట్టిన జన్మస్థలానికి మిసెస్ మేలీ మిస్‌రోసీ డాక్టర్ లాస్ బెర్నీ మిసెస్ బెడ్‌విన్ మిస్టర్ బ్రౌన్‌లో మిస్టర్ గ్రిమ్‌విగ్ మిస్టర్ మంక్స్ వచ్చారు. ఆలివర్ కూడా వాళ్ళతో బాటే వచ్చాడు.

బ్రౌన్‌లో అక్కడ ఓ హోటల్‌గది అద్దెకు తీసుకున్నాడు. అందరూ గదిలో కూర్చున్నారు.

బ్రౌన్‌లో మంక్స్ దిక్కు తిరిగి ఆలివర్ వేపు చేయెత్తి చూపిస్తూ "ఆ కుర్రవాడు ఎవరో తెలుసా? నీ సోదరుడు! ఇతడు నీ తండ్రికీ అతడు ప్రేమించిన ఆ అందమైన అమ్మాయికీ జన్మించినవాడు. ఈ కుర్రవాడి తల్లి పేరు ఆగ్నెస్ ఫ్లెమింగ్!.... ఇప్పుడు మిగిలిన కథ ఏమిటో నువ్వు చెప్పు?" అన్నాడు.

"అయితే వినండి!" అన్నాడు మంక్స్ "రోమ్‌లో మా నాన్నగారికి జబ్బు చేసింది. నా తల్లి నేనూ అక్కడికి వెళ్ళి ఆయనను కలుసుకున్నాము. ఆయన చనిపోయిన తర్వాత మా నాన్నగారి డ్రాయర్ సొరుగులో నేను రెండు కాగితాలు చూసాను. అందులో ఒకటి మా నాన్నగారు బ్రౌన్‌లో గారికి రాసినలేఖ రెండవది ఆగ్నెస్ పేరరాసిన ఉత్తరం! అప్పటికి ఆగ్నెస్ ప్రసవించలేదు. నిన్ను నేను వివాహం చేసుకుంటాను. నీకూ నీకు పుట్టబోయే వారికి గూడ సామాజిక గుర్తింపు యిస్తాను. నువ్వు చట్టరీత్యా నా భార్యవు కాగలవు.' అని మా నాన్న ఆమెతో చెప్పాడు. తన ప్రేమ చిహ్నంగా ఒక ఉంగరం బంగారపు లాకెట్ యిచ్చాడు. దానిమీద ఆమె క్రిష్టియన్ పేరు చెక్కించాడు. ఆ పేరు ప్రక్కన తన పేరు చెక్కడానికి ఖాళీస్థలాన్ని వుంచాడు. ఏదో ఒకనాడు ఆమెను వివాహం చేసు

కుంటే తనపేరు చెక్కించవచ్చునని మా నాన్న భావించాడు.''

అదంతా వింటున్న ఆలివర్‌కి దుఃఖం ఆగలేదు. అతడి చెంపల మీదుగా కన్నీరు కారసాగింది.

''సరే! ఇప్పుడు మీ నాన్న రాసిన వీలునామా గురించి చెప్పు?'' అన్నాడు బ్రౌన్‌లో.

మంక్స్ జవాబు చెప్పకుండా మౌనం పాటించాడు!

''అయితే దాని గురించి నేను చెబుతాను వినండి! ఆ వీలునామాలో తన దురదృష్టకరమైన వివాహ సంబంధం గురించీ నీ తల్లితో అతడు మానసికంగా ఎంత ఆవేదన పొందిందీ వివరంగా పొందు పరిచాడు. నీ తల్లి నీకు ఎంతటి దుష్ట స్వభావాన్ని అలవాటు చేసిందంటే నువ్వు నీ తండ్రి కనిపిస్తేచాలు అసహ్యించుకునేటంతగా నీకు నూరిపోసింది. నువ్వు చివరకు దుష్ట స్వభావంగల దుర్మార్గుడిగా తయారయ్యావు. అయినప్పటికి నీ తండ్రి మీ ఇద్దరికి అనగా నీకూ. నీ తల్లికీ సంవత్సరానికి చెరొక ఎనిమిది వందల పౌండ్లు యివ్వాలని వీలునామాలో రాసాడు. అతడి ఆస్థిలో చాలావరకు ఆగ్నెస్ ఫ్లెమింగ్ కిఆమె సంతానానికి చెందాలని కూడా రాసాడు. ఆమెకు మగ పిల్లవాడు కలిగితే, ఆ కుర్రవాడు నా పేరు ప్రఖ్యాతులకు కళంకం రాకుండా ఉండే విధంగా ప్రవర్తిస్తే చట్టవ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడకుండా వుంటే ఆ కుర్రవాడికి నా వారసత్వపు హక్కు లభిస్తుంది. నా వంశ నామాన్ని వాడుకోవచ్చు. నని కూడా నీ తండ్రి తన వీలునామాలో రాసాడు. దానిని ఆధారంగా చేసుకుని నువ్వు ఫాగిన్‌తో చేతులు కలిపావు. ఆలివర్‌ని దొంగగా ఓ నేరస్థుడిగా తయారు చేయమని చెప్పావు. ఆలివర్ నేరస్థుడిగా పోలీసులకు చిక్కితే వీలునామాలో నీ తండ్రి రాసిన ప్రకారం నీకు లాభం చేకూరుతుంది. ఆస్థికంతా నువ్వు ఒక్కడివే హక్కుదారుడవు కావచ్చునన్నది నీ లక్ష్యం! అవునా?'' అన్నాడు మిస్టర్ బ్రౌన్‌లో.

"ఆ వీలునామాను నా తల్లి కాల్చి బూడిద చేసింది. మా నాన్న ఆగ్నెస్‌కి రాసిన ఉత్తరం ఆమెకు చేరలేదు. అందువలన ఆమె తన తండ్రితో యదార్థ విషయం చెప్పేసింది. తన పెద్దకూతురు వివాహం కాకుండానే గర్భవతి అయిన సంగతి ఆ తండ్రికి అశనిపాతమే అయింది. ఇక అక్కడ ఉండలేక బంధువులకి ముఖం చూపించలేక ఒకనాటి రాత్రి తన ఇద్దరు కూతుళ్ళను తీసుకొని వేల్స్ వెళ్ళి పోయాడు. అవమానభారాన్ని భరించలేని ఆ తండ్రి వేల్స్‌లో తన పేరును మార్చు కొన్నాడు. అంతకంటె ఎక్కువగా అవమానభారాన్ని భరించలేని ఆగ్నెస్ తండ్రి వద్ద ఉండలేక ఇంటినుండి పారిపోయింది. ఎక్కడెక్కడో తిరిగింది. చివరకి అనాథ శరణాలయంలో బిడ్డను ప్రసవించి చనిపోయింది. ఆమె తండ్రి కూతురుకోసు ఎన్నోచోట్ల గాలించి చూసాడు. అయినా ప్రయోజనం లేకపోయింది. తన కూతురు అవమానభారాన్ని భరించలేక ఆత్మహత్య చేసుకొని ఉంటుందని ఆ తండ్రి భావిం చాడు. ఆ దిగులుతో అతడు మానసికంగా క్రుంగిపోయాడు. ఆ బాధతోనే అతడొకనాడు గుండె ఆగి మరణించాడు" అని చెప్పాడు మంక్స్.

వెంటనే బ్రౌన్‌లో అందుకుని "ఇక్కడనుంచి కొంత కథను నేను చెబుతాను!—పద్దెనిమిది సంవత్సరాల వయసు రాగానే మంక్స్ ఇంటినుండి పారి పోయాడు. ఎందుకు పారిపోయాడో తెలుసా? తన తల్లి నగలన్నీ దొంగిలించి వాటిని జూదంలో తగలేసాడు. ఇక ఇంటికి వెళ్ళకుండా లండన్ పారిపోయాడు. ఆ తర్వాత ఇతడు తన తల్లితో ఫ్రాన్స్ వెళ్ళిపోయాడు" అన్నాడు.

మరుక్షణం మంక్స్ మాట్లాడుతూ "నా తల్లి చనిపోయేముందు ఈ రహస్యాలన్నీ నాతో చెప్పింది. ఆగ్నెస్‌కి కొడుకుపుట్టి ఉంటాడని ఆమె నమ్మకం. 'ఆ పిల్లవాడు ఎక్కడున్నాసరే అన్నివిధాల సర్వనాశనం చేసేవరకూ విశ్రమించను' అని నా తల్లికి మాట యిచ్చాను" అన్నాడు.

ఆ గదిలో కూర్చున్న వారంతా మంక్స్ మాటలు ఊపిరి బిగబట్టి విన్నారు.

“ఆగ్నెస్‌కి సంబంధించిన ఉంగరం, లాకెట్ ఎక్కడ? వాటిని ఏం చేసావు?” అని బ్రౌన్‌లో అడిగాడు.

“వాటిని నేను ఓ దంపతులవద్దనుండి కొన్నాను. వాళ్ళ గురించి మీకు చెప్పి ఉన్నాను కదా!....చనిపోయిన ఆగ్నెస్ వద్దనుండి ఒక నర్సు దొంగిలించింది. ఆ నర్స్ వాటిని తాకట్టుషాపులో తాకట్టుపెట్టింది. నేను చెప్పిన దంపతులు వాటిని విడిపించి నాకు అమ్మేసారు. ఇప్పుడు ఆ లాకెట్, ఉంగరం ఎక్కడున్నాయో మీకు తెలుసు. నది అడుగుభాగాన ఎక్కడో ఉన్నాయి” అన్నాడు మంక్స్.

బ్రౌన్‌లో మాట్లాడకుండా గ్రిమ్‌విగ్ వంక చూస్తూ “మిస్టర్ అండ్ మిసెస్ బంబెల్ ఇద్దర్నీ లోనికి ప్రవేశపెట్టు” అన్నాడు.

వాళ్ళిద్దరూ లోనికి వచ్చారు. లాకెట్ గురించికానీ ఉంగరం గురించికానీ తమకేమీ తెలియదంటూ దంపతులిద్దరూ మొదట బ్రౌన్‌లోని బుకాయించబోయారు.

అప్పుడు గ్రిమ్‌విగ్ ఇద్దరు సేవకులను తీసుకొచ్చాడు.

“మంత్రసాని చనిపోయేరోజున నువ్వు మమ్మల్ని బయటికి పంపించి తలుపులు వేసేసుకున్నావు. అయినా మేము తలుపులకి చెవులు ఆనించి ఆ ముసలి మంత్రసాని చనిపోయేముందు నీతో ఏం చెప్పిందో మేము విన్నాము” అన్నాడు ఓ సేవకుడు మిసెస్ బంబెల్‌తో.

“మంత్రసాని ఏం చేసిందో నీతో చెబుతుండగా విన్నాము. మేము తలుపు సందుగుండా చూసేసరికి నువ్వు ఆమె చేతిలోవున్న కాగితంముక్కను లాక్కుంటున్నావు. ఆ తర్వాత మేము నిన్ను వెంటాడి వచ్చాము. నువ్వు తిన్నగా తాకట్టు దుకాణానికి వెళ్ళావు. నువ్వు లాకెట్, ఉంగరం విడిపిస్తుండగా మేము చూసాము” అన్నాడు రెండో సేవకుడు.

మిసెస్ బంబెల్ ఏమీ మాట్లాడలేకపోయింది.

"కావాలంటే యిక్కడికి తాళట్టుకొట్టువాడిని పిలిపించమంటే పిలి పిస్తాను." అన్నాడు గ్రిమ్‌విగ్ మిసెస్ బంబెల్‌తో.

"అవసరంలేదు. నేనా వస్తువులను విడిపించి మరొకరికి అమ్మేసాను." అంది మిసెస్ బంబెల్.



పెళ్ళికాకుండానే గర్భవతి అయిన కూతురును చూసి ఆమె తండ్రి దుఃఖించుట !

బ్రౌన్‌లో వారిని వెళ్ళిపొమ్మని చెప్పాడు.

బ్రౌన్‌లో రోసీ వంక చూస్తూ "ఇప్పుడు నేను కొన్ని విషయాలు బైటపెడు తున్నాను. నువ్వు వాటిని విని భయపడకు సుమా!" అన్నాడు నవ్వుతూ.

తర్వాత మంక్స్ దిక్కు తిరిగి అతడికి రోసీని చూపిస్తూ "ఈ అమ్మాయి ఎవరో నీకు తెలుసా?" అని అడిగాడు బ్రౌన్‌లో.

"నాకు తెలుసు!" అన్నాడు మంక్స్.



రోసీ తన పిన్ని అని తెలియగానే ఆలివర్ వచ్చి ఆమెను
కౌగలించుకుని దుఃఖించుట.

"నేను నిన్నెప్పుడూ చూడలేదు. మరినేనెలా తెలుసు నీకు?" అని రోసీ మంక్స్‌ని అడిగింది ఆశ్చర్యంగా.

"ఆగ్నెస్ తండ్రికి ఇద్దరు కుమార్తెలు కదూ!.... అయితే ఆ రెండో అమ్మాయి ఏమైందో నీకు తెలుసా మంక్స్?" బ్రౌన్‌లో అడిగాడు.

"పేరు మార్చుకున్న ఆగ్నెస్ తండ్రి చనిపోయాడు. అతడి బంధువులు ఎవరో, స్నేహితులు ఎవరో ఎవరికీ తెలియలేదు. అతడి రెండవ కుమార్తెను పూరి గుడిశెల్లో నివసించే పేదవాళ్ళు పెంచారు. అయితే నా తల్లి ఆగ్నెస్ చెల్లెలు ఎక్కడుందో తెలుసుకుంది. ఆ పిల్లను తీసుకొచ్చి నానా బాధలుపెట్టాలనీ ఆమె జీవితమంతా వేదనామయం చేయాలనీ, ఆ విధంగా తనకు ఆగ్నెస్ మీదున్న కసిని తీర్చుకోవాలని అనుకుంది. అయితే ఆ పిల్లను ఓ విధవరాలు చూసింది. ఆమె స్థితికి ఎంతో జాలిపడింది. వెంటనే ఆ పిల్లను తనతోబాటే తన ఇంటికి తీసుకుపోయి కొత్త జీవితాన్ని ప్రసాదించింది. ఆ తర్వాత ఆమె ఏమైందో ఎలా వుందో నాకు తెలియలేదు. మూడునెలల క్రితం మాత్రమే ఆమె గురించి తెలుసుకోగలిగాను." అంటూ చెప్పాడు మంక్స్.

"ఆ అమ్మాయి అంటే ఆగ్నెస్ చెల్లెలు యిప్పుడు ఎక్కడుందో చెప్పగలవా?" అన్నాడు బ్రౌనులో.

"ప్రస్తుతం ఆమె ఇక్కడే మనతోబాటు యీ గదిలోనే వుంది. ఆమె ఎవరోకాదు మిస్ రోసీయే!" అన్నాడు మంక్స్.

"ఓ నా ప్రియమైన మేనకోడలా!.... అయితే నువ్వు అనాథురాలివి కావన్నమాట! ఆగ్నెస్ చెల్లెలివా?" అంది మిసెస్ మేలీ సంతోషంగా.

మిస్‌రోసీ విసురుగా వచ్చి మిసెస్‌మేలీ ఒడిలో చిన్న పిల్లలా వొదిగిపోయింది.

అంతవరకు మౌనంగా కూర్చున్న ఆలివర్ పరిగెత్తుకుంటూ వచ్చి రోసీ మెడ కౌగలించుకుని "పిన్నీ!" అంటూ బావురుమన్నాడు.

అనాథలుగా పెరిగిన ఆ ఇద్దరూ ఒకరినొకరు కౌగలించుకుని ఏడుస్తూ వుండిపోయారు.

అప్పుడే ఆ గదిలో అడుగుపెట్టిన మిస్టర్ హార్రీ "ఇప్పుడు రోసీని వివాహం చేసుకునేందుకు ఎవరికీ అభ్యంతరం లేదనుకుంటాను." అన్నాడు.

"పల్లెటూరులో వున్న ఓ చిన్న చర్చిలో వివాహం చేసుకుంటానంటే నాకు ఎటువంటి అభ్యంతరమూ వుండదు." అంది మిసెస్ మేలీ నవ్వుతూ.

## 23

జనసందోహంతో కోర్టు కిట కిటలాడ సాగింది!.... ఫాగిన్ మీద కేసు నడిచింది.

"నేరస్థుడే!" జడ్జి తీర్పు చెప్పాడు.

ఫాగిన్‌కి ఉరిశిక్ష విధించబడింది. మూడు రోజుల తర్వాత ఉరి తీయవలసిందిగా జడ్జి తీర్పు చెప్పాడు.

ఆ విషయం ఆలివర్‌కి తెలిసింది. అతడు బాధపడ్డాడు. ఫాగిన్ ఆత్మకు శాంతి కలగాలని భగవంతుడ్ని ప్రార్థించాడు.

మిస్టర్ హార్రీకి, మిస్ రోసీకి చర్చిలో అతివైభవంగా వివాహం జరిగింది.

ఆలివర్ తండ్రి ఆస్థిని, మిస్టర్ బ్రౌన్‌లో రెండు భాగాలు చేసాడు. ఒక భాగాన్ని మంక్స్‌కీ, మరొక భాగాన్ని ఆలివర్‌కి పంచి యిచ్చాడు.

మంక్స్ మీద కూడా కోర్టులో కేసు జరిగింది. జడ్జి మంక్స్‌కి యావజ్జీవ కారాగార శిక్ష విధించాడు. మంక్స్ శిక్ష అనుభవిస్తూ జైలులోనే చనిపోయాడు.

ఫాగిన్ దొంగల ముఠా తాలూకు మిగతా సభ్యులు, చెల్లాచెదురుగా వెళ్ళిపోయారు. ఎవరూ సుఖజీవితాన్ని పొందలేకపోయారు. చాలామంది పోలీసులకు చిక్కి జైలు పాలయ్యారు.

ఛార్లీ బేట్స్ మాత్రం పాత జీవితానికి స్వస్తి చెప్పి, మంచివాడుగా మారగలిగాడు.

ఫాగిన్‌ని పట్టి యివ్వడంలో క్లేపోల్ పోలీసులకు రహస్య సమాచారం యిచ్చి సహాయం చేయడంవల్ల కోర్టు అతడ్ని నిర్దోషిగా విడిచిపెట్టింది.

మిస్టర్ బంబెల్, మిసెస్ బంబెల్ అనాథ శరణాలయంలోని పిల్లలను సరిగా చూడడంలేదనీ, ధనం దిగమింగేస్తున్నారన్న ఆరోపణలు నిజమని తేలడం వల్ల, వాళ్ళ ఉద్యోగాలు ఊడిపోయాయి.

ఆలివర్‌ని, మిస్టర్ బ్రౌన్‌లో తన కొడుకుగా దత్తత చేసుకున్నాడు. అతడికి సమాజంలో ఒక గుర్తింపు కలిగిస్తూ ఆలివర్ కొత్త జీవితానికి నాంది పలికాడు.

ఆగ్నేస్ ఫ్లెమింగ్ స్వర్గంలో ఉండి, ఆలివర్‌ని చూస్తూ ఉన్నట్లయితే తన కొడుకు జీవితానికి ఒక అర్థం ఏర్పడినందుకు, ఎంతో గర్వపడుతూ పొంగిపోతూ ఉంటుంది.




—)*(—